

మహాగణపతి - కుమారారామ క్షేత్రము - సామర్లకోట

// ĀRĀDHANA

(A RELIGIOUS MONTHLY MAGAZINE)

VOL. III  DECEMBER 1957  No. 12



PUBLICATION OFFICE

" ĀRĀDHANA "

OFFICE OF THE DEPUTY COMMISSIONER

*Hindu Religious & Charitable Endowments (Administration) Department, (Andhra)*

MASULIPATAM.

ANNUAL SUBSCRIPTION Rs. 12/-

PER MONTHLY COPY Re. 1/-

# ఆరాధన




హేవళంబి | మాసపత్రిక | మార్గశిరము

## విషయసూచిక

పుట

### తెనుగు

ముఖచిత్రము - శ్రీ బాలాత్రిపురసుందరీ అమ్మవారు - సామర్లకోట - త్రివర్ణచిత్రము.



---

## CONTENTS

### ENGLISH

PAGE



---

" ఆనందరూప మమృతం యద్విభాతి "




సకృదేవ ప్రపన్నాయ 'తవాస్మీ'తి చ యాచతే।
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ॥

సంపుటము 3 హేవలంబి - మార్గశిరము సంచిక ౧౨

ॐ

ध्रुवा दिशां विष्णुपत्न्यघोराऽस्येशाना सहसो या मनोता ।

बृहस्पतिर्मातरिश्वोत वायुः संध्रुवाना वाता अभि नो गृणन्तु ॥

तै॥ सं॥ कां-४. प्रपा-४. अनु. १२.

తాత్పర్యము:—సూర్యుని గతి ననుసరించి వచ్చిన ప్రాచ్యాదివిభాగము లేకుండినదై స్థిరమైనదియు, సమానరూపముకలదియు, విష్ణువు పాలకుడుగా కలిగినదియు, శాంతమగు రూపము కలదియు, సమస్తమగు బలమును నియమించునట్టిదియు, అందరిచే పూజింపబడునదియునగు సామాన్యమగు దిక్కు, బృహస్పతియు, మాతరిశ్వమను ముఖ్యవాయువు, అచ్చటచ్చట వీచు మిగిలిన వాయువులును మనకు హితమును సమకూర్చుగాక !!!

विष्टम्भो दिवो धरुणः पृथिव्या अस्येशाना जगतो विष्णुपत्नी ।

विश्वव्यचा इषयन्ती सुभूतिः शिवा नो अस्त्वदितिरुपस्थे ॥

तै॥ सं॥ कां-४. प्रपा-४. अनु. १२.

తాత్పర్యము:—ఇది యింత పరిమితి కలదనునట్టి పరిమితి లేక సామాన్యమగు రూపము కలిగినట్టియు దేవతారూపము కలిగినదియు, ద్యులోకమున కాధారభూతమైనట్టిదియు, భూమికి ధారకమగునట్టియు, ఈ ప్రపంచమున కంతటికిని స్వామినియగునట్టియు, విష్ణువు పాలకుడుగా నున్నట్టియు, ప్రపంచమునంతటిని వ్యాపించియున్నట్టియు, ప్రజలకు అన్నాద్యైశ్వర్యములను సమకూర్చునట్టియు మంగళకరమగునట్టి దిక్కు తన నాశ్రయించుకొనియున్న మనలకు శాంతమగునదియు సుఖకరమైనదియునగు గాక !!!

# ॥ वेदान्ताः ॥

लिङ्गनसोमयाजी - आत्रेयः ( रचयिता )

चत्वारो वेदाः—ऋग्यजुस्सामाथर्वाण इति । प्रतिवेदं पूर्वभागः सोमादिकर्माणि उत्तरभागः ज्ञानं च प्रतिपादयति । वेदानामुत्तरभागानां ब्रह्मज्ञानोपदेशकत्वात्ते वेदान्ता इत्युच्यन्ते । यद्वा, अन्तशब्दस्य निश्चितार्थपरत्वात् वेदानां निश्चितोऽर्थः ज्ञानमिति संगच्छते । कर्मकाण्डस्य सर्वस्य ज्ञाने परिसमाप्तिः । कर्माचरणेन चित्तशुद्धिः, ततः श्रवणादौ अर्हतायाः प्राप्तिः । सर्वं हि कर्म ज्ञानावाप्तये सहायभूतं भवति । अतो वेदेषु आदौ कर्माणि ततो ज्ञानं च प्रस्तूयन्ते ।

यद्वा, वेदशब्दो ज्ञानवाचकः, 'विदि' क्रियायाः ज्ञानार्थकत्वात् । केवलज्ञानस्वरूपं ब्रह्म । 'सत्यं ज्ञानमनन्तं ब्रह्मे' ति श्रुतेः । ज्ञानं नाम ज्ञप्तिः अवबोधः । वेदितुः स्वरूपमेव ब्रह्म । यथा सवितुः प्रकाशः, अग्नेः औष्ण्यम् । तच्च स्वयंप्रकाशस्वरूपं, अविक्रियं, नित्यं, निरतिशयं, सूक्ष्मातिसूक्ष्मं च । ज्ञाधातोः अर्थभूतानि घटपटादिज्ञानानि मनोवृत्तेः विकाराणि । 'ज्ञा' इति क्रियायाः आवश्यकीभूतानां कर्तृक्रियाकारकाणां फलभूतत्वात् न तेषां स्वयंप्रकाशस्वरूपत्वं नित्यत्वं वा सिध्यति । जडभूतं हि मनः । तथाचेन्द्रियाणि सर्वाणि । प्रकाशान्तरं विना न तानि प्रकाशन्ते । न सारथिमन्तरा रथश्चलति । ब्रह्मप्रकाशेन प्रकाशितेन मनसा सर्वोहि वस्तुविज्ञानव्यवहारो निर्वर्त्यते । नान्यथा । दीपकान्तेरभावे न चक्षू रूपं गृह्णाति । ब्रह्मचैतन्यमेव चक्षुरादीनामिन्द्रियाणां तत्तद्विषयैस्संयोगे इन्द्रियगोलकमुखेन बहिर्निर्गत्य विषयाकारेण परिणमते । तादृशमनोवृत्तौ ब्रह्मचैतन्यं प्रतिबिम्बते । ब्रह्मचैतन्यमेव चक्षुषा रूपाणि पश्यति । श्रोत्रेण शब्दान् शृणोति । विना ब्रह्मचैतन्यं चक्षुरादीनि इन्द्रियाणि स्वस्वव्यापाराय न प्रभवन्ति । अत एवोक्तं श्रुत्या, "ब्रह्मचैतन्यमेव सर्वेषामिन्द्रियाणामिन्द्रियं भवति । न तस्य अन्यत् अविज्ञेयं सूक्ष्मं व्यवहितं विप्रकृष्टं भूतं भवत् भविष्यद्वा अस्ती" ति भाष्यकारः । ब्रह्मज्ञानमेव सर्वेषां ज्ञानानां परमावधिः । अन्यानि ज्ञानानि सर्वाणि इन्द्रियजन्यानि । मनोवृत्तेः परिणामरूपाणि । अनित्यानि च । ब्रह्मज्ञानं तु नित्यशुद्धबुद्धमुक्तस्वभावम् । ब्रह्मज्ञानस्य प्रकाशकं ज्ञानान्तरं न विद्यते । "न हि विज्ञातुर्विज्ञातेर्विपरिलोपो विद्यतेऽविनाशित्वान्नतु तस्य द्वितीयमस्ती" ति श्रुतिः । अशेषज्ञानसन्ततेः परमावधिभूतत्वात् ब्रह्मज्ञानं वेदान्त इत्युच्यते । पुरुषार्थसिसाधयिषुभिः तदेव अवश्यं ज्ञेयं भवति नान्यत् । "अन्या वाचो विमुञ्चथ" इति च ब्रूते श्रुतिः ।

वेदान्ताः 'उपनिषदः' इति चोच्यन्ते । उप - ब्रह्मणस्समीपे नि - नितरां, 'षदॢ' धातोश्च शातनं, छेदनं, अवसादनमिति त्रयोऽर्थाः । उपनिषदः संसारवृक्षं शातयन्त्यः छेदयन्त्यः अवसादयन्त्यश्च ब्रह्मविद्यायास्सामीप्येन उपेत्य आत्यन्तिकं निरतिशयं परं ब्रह्म गमयन्तीति उपनिषच्छब्दस्य निष्पीडितोऽर्थः । ब्रह्मविद्याप्रतिपादकत्वात् ग्रन्थोऽपि तेनैव नाम्ना ज्ञायते यथा 'लाङ्गलं जीवन' मिति ।

एताश्च उपनिषदः ब्रह्मविद्याप्रतिपादिकाः वेदानामन्तिमे भागाश्च सन्तः "वेदान्ता" इति च व्यवह्रियन्ते । चतुर्णां वेदानां तत्तच्छाखाभेदेन बहुळतया तत्तच्छाखानुरूपमुपनिषदोऽपि बहुला भवन्ति । परन्तु तासां बहुळप्राचुर्येण प्रसिद्धाः ब्रह्मविद्याप्रतिपादिकाः दशोपनिषदः सामान्येन परिगृह्यन्ते - ताश्च— **ईश, केन, कठ, प्रश्न, मुण्ड, माण्डूक्य, तैत्तिरीय, ऐतरेय, छान्दोग्य, बृहदारण्यकाः** - इति ।

॥ इति शम् ॥

—

శ్రీ జగద్గురు యాజ్ఞవల్క్య

# మహర్షి పూజా పుష్పాంజలి

కవిశేఖర పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

శ్రీవిజ్ఞానికులేంద్రుఁడౌ జనక రాజేంద్రుండు పందెమ్ముగా
గోవర్గంబు సువర్ణభూషితము గైకో నిల్ప - ఉద్దండ వి
ద్యా విద్యోతితులౌ మహర్షుల నొకండైనన్ గొనండయ్యె, నో
హెూ! విద్వన్మణి! యాజ్ఞవల్క్యముని! నీవొక్కండవున్ దక్కగన్॥ ౧.

అత్యాశ్చర్యము నీ ప్రతాప మది లోకాతీతవిద్యోత, మా
దిత్య శ్రీ గురుమూర్తిచే నది సముద్దిష్టమ్మపూర్వమ్మహెూ!
నిత్యోద్యోగివి! పండితాగ్రణివి! తండ్రీ! నీవు బ్రహ్మాత్మయో
గత్యాగమ్ముల నీ సమానుఁడొరుఁడొక్కండైన లేఁడీభువిన్ (లేఁడే భువిన్)! ౨.

ఆ విద్వత్సభఁబోలఁజాలు సభ లేదానాడు నీనాడు ; సత్
ప్రాపణ్యమ్మున గౌతమాది ఋషివర్గమ్మెల్ల నిర్జించు వి
ద్యావేశమ్ముగలట్టి నిన్గురునిగా నర్థించి భూషించి నా
డా విద్వత్ప్రభుఁడట్టి విశ్వజయమెందైనన్ గనన్ శక్యమే? 3.

గర్వాంధుండు విదగ్ధచిత్తుడగు శాకల్యుండు - దుర్యోగుఁడై
దుర్వారోద్యముఁడై దురుక్తుల నినున్ దూలింపరాఁగా, మహా
ఖర్వప్రజ్ఞ సదుత్తరమ్ముల పరిష్కారమ్ముఁగావించి నీ
సర్వజ్ఞత్వమపూర్వమద్భుతసమీక్షా! యాజ్ఞవల్క్యప్రభూ! ౪.

బహువిజ్ఞానధురంధరమ్మగుచు విశ్వఖ్యాతవిజ్ఞాన వా
ర్ధహరీధీరగభీరమైన పరమార్థంబెల్ల సంధించు శ్రీ
బృహదారణ్యకమైన జ్ఞానఖని నీ విజ్ఞాన సంభూతమై
యహమున్ ద్రుంచుచు స్వాత్మ పీఠమున మమ్మాడించు, యోగిప్రభూ! ౫.

శ్రుతులందున్, స్మృతులందు ప్రౌఢములు నీ సూక్తుల్, జగద్గీతమ
క్షతమార్యస్తుతమాత్మగీతమది విశ్వఖ్యాతమో హెూ! జగ
ద్గీత మూర్తీ! అతిలోకమౌ ప్రతిభ నుద్దీపించుచున్నావు, శా
శ్వతవేదార్థరసప్రసారమున మా స్వాంతమ్ము పూరింపవే॥ ౬.

నీ విజ్ఞానముఁగాంచి నిన్వలచి నిన్ సేవించి భావించి, వి
ద్యావిజ్ఞానములన్ గడించుకొని, యాహా! తొల్లి మైత్రేయి, త
త్త్వావిర్భావమునంది ధన్యతఁగనెన్ స్వామీ! మహాభక్తి నీ
సేవాభాగ్యముఁగాంచిరెందరొ మహాశిష్యుల్ యతీంద్రోత్తమా! ౭.

స్వామీ! నీవపరోక్షమూర్తివి! కృపాశాలీ! పరోక్షమ్ము గా
మేమున్ శిష్యులమే, మమున్ మనుపుమీ మేలెంచి వేదాంత వి
ద్యామార్తాండుఁడవీవు నీ మధురవిద్యాయోగకాంతిప్రజం
బేమైనన్ ప్రసరింపఁజేయు మదె మమ్మేలున్ గురు శ్రీగురూ! ౮.

జీవాపేతములైన స్తంభముల సంజీవింపఁగాఁజేసె నో
శ్రీ విద్యానిధి! నీ కరాంబుజవినిక్షిప్తమ్ములౌ నక్షతల్;
జీవశ్రీయుతులౌ మనుష్యులకు నీ శ్రీమత్కటాక్ష ప్రసా
రావాప్తిన్ గనరానిదేది గురుదేవా! యాజ్ఞవల్క్యేశ్వరా! ౯.

ఇది-మా యంజలి - దీనినందుకొని, స్వామీ! మమ్ము పాలింపు ము
న్నది యేదో యది మాకొసంగుము మహాత్మా! పూర్ణపూర్ణప్రభా
మధుర శ్రీకర మంగళమ్మయిన సన్మార్గంబు సంధించి, మా
హృదయజ్యోతి వెలుంగఁజేయుము కృపాళూ! యాజ్ఞవల్క్యప్రభూ!॥ ౧౦.

# కుమారారామ భీమేశ్వరస్వామి - సామర్లకోట

*శ్రీమాన్, కవిరాజశిరోమణి, పండిత, టీవి నరసింహాచార్యులు, అష్టావధాని, అవనిగడ్డ.*

ఈ క్షేత్రము గొప్ప శివక్షేత్రము. ఇది తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురం తాలూకాలో దక్షిణ రైల్వే (Southern Railway) లైనులో కలదు. దీనికి దక్షిణోత్తరముల చరిత్రాత్మకమైన రాజమహేంద్రవర పిఠాపుర పట్టణములుకలవు. మరియు నిది పంచారామ క్షేత్రములలోనొకటి. దీనిని పూర్వము చాళుక్యులు పరిపాలించుటచే నీదేవునికూడ "చాళుక్య కుమారారామ భీమేశ్వరుఁడ"ని పిలుచుచుందురు. ఇట్లు ప్రభువుల పేరులతోకూడుకొని దేవుని నామములుండుట యానాటి యాచారము, సాంప్రదాయమని, "చోడనారాయణదేవర, పల్లవ గోపాలమూర్తి, కదంబ నృసింహుఁడ"ను పేర్లు సాక్ష్యమిచ్చుచున్నవి. అట్లే ఇది పూర్వము పూర్వ చాళుక్య ప్రభువులచే పరిపాలింపఁబడుటచే స్వామికిని యాపేరే కలిగెను. మరియు భీమేశ్వరుని వాసమువలన దీనిని భీమవరమందురు. కాని పశ్చిమగోదావరి జిల్లాలో మరియొక భీమవరముండుటచే దానిని "గుణిపూడి భీమవరమ"నియు దీనిని "సామర్లకోట భీమవరమ"నియు పిలిచెదరు. ఈ లింగమును కుమారస్వామి తొలుత ప్రతిష్ఠచేయుటచే దీనికి "కుమారారామ"మని కూడ లోకులు వాకొనుటయేగాక పురాణములలోకూడ "కుమారారామ"మనియే ప్రశంసింపఁబడియున్నది. తొలుత కుమారస్వామిచే ప్రతిష్ఠితుఁడై యాస్వామి కొలువఁబడుచుండెను. తరువాత చాళుక్యభూపతులు యిప్పడున్న దేవాలయ ప్రాకారాదులను కట్టించిరి.

## ఆలయ నిర్మాణము - శిల్పచాతుర్యము

ఈ దేవాలయవిమానము మేడపైన మహోన్నతముగ సమచతురముగ నిర్మింపఁబడియున్నది. ఇది నాలుగు



**భీమగుండము - మంటపము.**

పలకలుగా కట్టి పంచకంఠములుగా తీర్చఁబడినది. దీనికి పంచకేతకి విమానమనిపేరు. ఇట్టిదే దక్షిణదేశమున "తిరుక్కురుంగుడి"లో కలదు. దీనిని దేవశిల్పమున "మహాదేవ" జాతిలో జేర్చిరి. స్వామికూడ "నిలువు" లీల. దీనికి మూడుఆవరణలు కలవు. లింగముకూడ భూమినుండి మూడుఅంతస్థుల మేడలోకి వ్యాపించి యున్నది. అసలు మూలవిరాట్టుచుట్టును గర్భాలయ మును, గర్భాలయముచుట్టును ప్రదక్షిణముచేయుటకు యనువగునటుల తిరుచుట్టుమాలికయు మేడపైనను, క్రిందనుకూడ కలవు. ఈ తిరుచుట్టుమాలిక (గర్భాలయ మునకుచుట్టూ ప్రదక్షిణమొనర్చుటకు తగినట్టుగా) రెండు గజములవెడల్పున, (చుట్టుమంటపమును) కలవు. ఇందు ముందు ముఖమంటపమును అందొక నందియుఁగలవు. ఈ మేడపైకి యెక్కుటకు దిగుటకు ప్రదక్షిణ విధానమున మెట్లుకట్టింపఁబడియున్నది. ఇట్లే ఆలయమునకు క్రింద ముఖమంటపమును ఆస్థానమంటపమును కలవు. ఇట్లు ఆలయము మొదటి యంతస్థు సుమారొక గజముండును. రెండవయంతస్థు 10 గజములు యెత్తును, యాపైన విమానము 15 గజములయెత్తునుగలవు. ఆలయమునకు చుట్టును 10 గజముల ప్రథమావరణమును, దానికి తిరిగి 6 గజముల వెడల్పున, నొక్కొక్కవైపుకు 18 స్తంభములుకలిగి, 50 గజముల పొడవును, 50 గజముల వెడల్పును చదరముకలిగిన బేడామండపములు నల్ల రాతితోనే కట్టింపఁబడియున్నవి. మరియు యీ బేడా మంటపములుకూడ రెండస్థుల మేడలైయున్నవి. పరి వారదేవతలు క్రిందబేడామండపములలో నలువైపులను ప్రతిష్ఠింపబడినవి. బేడామంటపములు యొక్కొక్క పార్శ్వ మునకు అష్టాదశమంటపములు (18) గా విభాగింపఁబడి యున్నవి. ఇట్లే పైయంతస్థులోను అష్టాదశమంటపములు నిర్మింపఁబడుటచే యొక్కొక్క వైపుకు 36 మంటప ములు ప్రాప్తిని మూడు దిక్కుల అష్టోత్తరశత (108) మండపములు గణింపఁబడినవి. పై బేడామంటపము లన్నియు, యాత్రికులు యుత్సవదినములలో విశ్రాంతి తీసుకొనుటకుపయోగింపబడుచున్నవి. మొత్తము 160 స్తంభములు కలవు. తూర్పుభాగమున 16 అంకణముల ఆస్థానమంటపము బహు విశ్రాంతిగా కట్టఁబడినది. ఇందు సుందరమైన గొప్ప నంది ప్రతిష్ఠింపఁబడియున్నది. ఈ నంది క్రింది మూలవిరాట్టుకు యెదురుగనున్నది. ఈ



ఆలయవిమాన దృశ్యము.

ఆస్థానమంటపముపై మరియొక 16 అంకణముల రాజాస్థానమంటపము కట్టింపఁబడియున్నది. ఇందు స్వామి వారి యుత్సవదినములలో కాలక్షేపములును, పర్వదినములందు సభాకార్యక్రమములును జరుపుచుందురు. ఈ మంటపములవెనుక 30 గజముల వైశాల్యము చుట్టూవిడిచి తృతీయావరణమునకు 10 గజముల యెత్తును 2 గజముల వెడల్పునుఁగల నల్లరాతి ప్రాకారమును కట్టించిరి. ఇదే తృతీయావరణము. ఇందు ప్రాగ్భాగమున వృద్ధాశ్వత్థవృక్షములును, అశ్వత్థమూలముల భక్తులచే ప్రతిష్ఠింపఁబడిన నాగవిగ్రహములును వేదికలును కలవు. సంతానకాములీ యశ్వత్థ నారాయణ నాగదేవులకు ప్రదక్షిణములను సేయుచుందురు. కొంత పుష్పవనమును వేసిరి. దీనిలో యీశాన్య భాగమున యాత్రికులు విశ్రమించుటకు విశ్రాంతిమంటపములును, ఆగ్నేయదిశను పాకశాలయు కలవు. ఈ బహిఃప్రాకారమునకు నాలుగువైపులను సింహద్వారములుకలవు. బేడామంటప స్తంభములపైనను చక్కని విగ్రహములు చెక్కఁబడి యున్నవి. ద్వితీయ ప్రాకారమునకు ఉత్తరభాగమున పైపనను రెండు యకాంగనల విగ్రహములు, నల్లరాతితోనే చెక్కఁబడియున్నవి. ఇవి యెన్నివందల సంవత్సరముల క్రింద నిర్మింపఁబడినను నేటికిని సజీవచిత్రములవలే భక్తుల నాకర్షించుచున్నవి.

### ఉయ్యాలమంటపము - తెప్పమంటపము

ఈ యాలయమును నిర్మించిన శిల్పి ధన్యుఁడని చెప్పఁదగిన గొప్ప విశేషమొకటి యీఆలయమున కానవచ్చుచున్నది. అదియే ఉయ్యాల మంటపము. ఇట్టి ఉయ్యాల మంటపము తిరుపతి క్షేత్రములో శ్రీనివాసమూర్తి సన్నిధిని యొకటి కలదు. ఇందలి చిత్రమేమనగా - క్రింద రెండు గజముల ఎత్తున రాతిచదరము. దానిపై నాలుగువైపులను 4 రాతి స్తంభములు. ఆ స్తంభములపై నొకరాతికప్పు యమర్పఁబడియున్నది. ఇది యంతయు నల్లరాతి కట్టడమే. కాని నాలుగు స్తంభములు క్రిందవేదిక (Plat form)పై యానక విడిగానున్నవి. వేదిక మూలలనుండి శిఖరాంతము 5 గజములు యెత్తు వుండును. ఈ మంటపమును బాలుడైనను కదిలించినచో "ఉయ్యాల" వలె యూగుచుండును. స్వామిని విశేషదినములందును, పంచపర్వములందును, బ్రహ్మోత్సవములందును యీ డోలామంటపమున వేంచేపు



ముఖమంటపమునందలి నందీశ్వరుడు.

చేసి డోలోత్సవమును చేయుచుందురు. ఈ మండపము ద్వితీయావరణమున యీశాన్యకోణమున గలదు. ఇట్లే ఆగ్నేయకోణమున యాగమంటపము కలదు. తెప్పమంటపము స్వామివారి కభిముఖముగ భీమనది(భీమకుండము లేక బ్రహ్మకుండము) లో కలదు. ఈ మంటపము నీటిపై తేలుచున్నట్లుండును. దీనిలోనే స్వామికి తెప్పోత్సవమును చేయుదురు. అనగా యిదివరకు యీ మంటపమే నీటిపై తేలుచు స్వామిని యందు వేంచేపుచేసిన తరవాత నీటిలో చుట్టివచ్చుట యాచారముగ నుండెడిదట. దానిని కొందరు శిథిలపర్చుటచే నిప్పుడున్నచోట చుట్టును ప్రాకారమును కట్టి, కదలకుండా చేసిరి. ఇట్టి శిల్పచాతుర్యము (మంటప మంతయు నీటిపై తేలునట్లు కట్టుట) యెచ్చటను లేదు. ప్రస్తుతమీమంటపము బిగింపఁబడి యున్నది.

### భీమనది - బ్రహ్మకుండము

ఈ సరోవరమునకు భీమనది యని పేరు. ఇది భీమేశ్వరునభిషేకించుటకై కుమారస్వామి "ఏలా" నదినుండి అంతర్వాహినిగా త్రవ్వితెచ్చెనట. ఇట్లు యిది శ్రీ భీమేశ్వరునికొరకు తేఁబడినదగుటచేత, "భీమనది" యనియు బ్రహ్మ యీ కుండతీరమున తపంబొనర్చి సిద్ధినిఁబడయుటచే "బ్రహ్మకుండ" మనియు కుమారస్వామి కొనివచ్చుటచే "కుమారతీర్థ" మనియు పేరులు కలిగి మహామహిమాన్వితమై విరాజిల్లుచున్నది. ఇందువలన దీని మహిమ దేవతలకైనను కొనియాడ తరముకాదని క్షేత్రమాహాత్మ్యమున వర్ణింపబడియున్నది.

### భీమేశ్వరలింగము - తృతీయఖండము

అమరారామ, దక్షారామ, భీమారామ, సోమారామ క్షీరారామములను పంచారామములలోనిది తృతీయ శకలము. తారకాసురుఁడు ధరించిన అమృతలింగమును, షణ్ముఖుడు పంచఖండములుగా ఖండించిన తరువాత. ఇంద్ర, సూర్య, కుమార, చంద్ర విష్ణువులచే నా ఖండపంచకమును ప్రతిష్ఠింపఁబడినట్లు క్షీరారామక్షేత్రమాహాత్మ్యమున వర్ణింపఁబడినది. అందు యిది తృతీయ శకలమగుటచే నిదియు అమరారామ దక్షారామమువలెనే లింగము 15 అడుగుల యెత్తు కలిగి సమానప్తులము



ఊయల మంటపము—(చిన్నపిల్లలైనను ఈ మంటప స్తంభము నొకదానిని యీచిన మంటపమంతయు ఊయలవలె నూగును. ఇట్టి శిల్పమెందును కానరాదు.)

కలిగి శ్వేతశిలా (పాలరాతి) లింగముగ యలరారుచున్నది. ఈ లింగపంచకమునకున్నూ యిరుపార్శ్వములయందు రెండుచారలు సమానముగనే గలవు. వీటినే రక్తధారలని అర్చకులు వాకొందురు. ఇందువలననే ఆలయములున్నూ సమాన కొలతలననుసరించియే నిర్మింపఁబడినవి. ఇందువల్లనే స్వామియొక్క అఖండత్వమును తేజోవిశేషమును లింగావతారవైభవమును వెల్లడియగుచున్నవి.

## పానుపట్టము - చండీశ్వరుఁడు

స్వామివారికి మేడపైననే పూర్ణపూజోపచారములు జరుపుచుందురు అందువలన స్వామికి అక్కడనే పానుపట్టము కలదు. కాని యిది అన్ని దేవాలయములలోవలె నుండక విలక్షణముగానున్నది. దీనికి లింగము యుండదు. కనుకనే యభిషేక తీర్థము క్రిందికిదిగి సోమసూత్రమున పడుచుండును. ఈ పానుపట్టముయొక్క ముఖమును చండీశ్వరుఁడుత్తరాభిముఖుఁడై మోయుచున్నట్లు చిత్రింపఁబడినది. ఇట్లెక్కడను యుండుటాచారముకానవచ్చుటలేదు. ఇది యిక్కడొక విలక్షణమైన లక్షణము.

## మూలవిరాట్టు - చీకటికోణము

మూర్తి యెక్కడ ప్రతిష్ఠింపఁబడినదో స్థలనిర్ణయము చేయుట కష్టము. ఆ లింగమునకు క్రిందను భూమిపై పానువట్టము కలదు. కాని అదియు లింగమునకు అంటక యుండుటచే లింగము పానుపట్టముమీద ప్రతిష్ఠింపఁబడినది కాదని లింగస్థాపనము జరిగిన తరువాత పానువట్టము లమర్పబడినట్లు తోచెడిని. ఆ గర్భాలయము చీకటికోణమున నుండుటచే "మూలవిరాట్ దర్శనము"ను "చీకటికోణదర్శన" మందురు. దీనికినీ తిరుచుట్టుమాలిక కలదు. ఈ ఆలయకట్టడమద్భుతముగా నున్నది.

## ద్వారపాలకులు - పరివారదేవతలు

ప్రధానద్వారమున స్వామివారికి దక్షిణోత్తరముల "చంత ప్రచండులు" ద్వారపాలకులుగ నమర్పఁబడిరి. ఇంక వేదామండపములో క్రిందిభాగమున దక్షిణపార్శ్వమున "సూర్య, విఘ్నేశ్వర, సప్తమాతృకలు, బ్రహ్మదేవుఁడు" ప్రతిష్ఠితులై యుండిరి. పశ్చిమపార్శ్వమున "సరస్వతి శ్రీరామలింగేశ్వర, కుమారస్వామి, సుబ్రహ్మణ్యేశ్వరులు" ప్రతిష్ఠింపఁబడిరి. ఉత్తరభాగమున "మహావిష్ణు, లక్ష్మీనారాయణ శనైశ్చర వీరభద్రా" లయములు కలవు. ఇచట క్షేత్రపాలకుఁడు లక్ష్మీనారాయణుఁడు. శనైశ్చరునకు ప్రతి శనివారమును మూన శివరాత్రి యందును తైలాభిషేకమొసర్తురు.



చండ, ప్రచండులు - ద్వారపాలకులు - ఆలయ ముఖదృశ్యము.

### బాలాత్రిపురసుందరి - మహిషాసురమర్దని

ఈ క్షేత్రమున శ్రీ భీమేశ్వరస్వామివారి దేవేరి బాలాత్రిపురసుందరి. (చూ. ముఖచిత్రము.) బాలాత్రిపురసుందరి కేవలము బాలాత్రిపురసుందరియే. ఆమెకామెయే సాటి. ఈమె యెంతయో సుందరమైన విగ్రహము. ఈమె ద్వితీయావరణమున అస్థాన ముఖమంటపమునకు దక్షిణభాగమున పశ్చిమాభిముఖముగా ప్రతిష్ఠింపఁబడియున్నది. ఇక్కడ అమ్మవారిముందు మేరు యంత్రమును ప్రతిష్ఠించియుండిరి. ద్వితీయావరణములోనే అస్థానమంటపమునకు నుత్తరభాగమున "శ్రీవల్లీ, దేవసేన" సహితముగా సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ప్రతిష్ఠింపఁబడియుండిరి. ఈ విగ్రహములును స్తంభములపై చెక్కఁబడిన విగ్రహములుగూడ శిల్పగౌరవమును వెల్లడించుచున్నవి. బాలాత్రిపురసుందరి అమ్మవారికి విలువగల స్వర్ణరజత కవచములున్నూ, రత్నాభరణములున్నూ కలవు. ఈమె మహామహిమాన్వితమైన అష్టావింశతి శక్తులలో నొకర్తెయగుటచే పూర్వము మునీశ్వరులును, నేడు పెక్కండ్రు శ్రీవిద్యోపాసకులును యీ దేవిని గొలిచి అవాప్తకాములగుచున్నారు. పెక్కండ్రు సిద్ధులును నీ క్షేత్రమున తపస్సుఁజేసి సిద్ధినిఁబొంది యుండిరి. మహిషాసురమర్దని యీ క్షేత్రమునకు మంత్రశాస్త్ర విధిననుసరించి వాయుకోణమున ప్రతిష్ఠింపఁబడి యున్నది.

### దానములు - శాసనములు

ఈదేవుని తొలుత శ్రీకుమారస్వామి ప్రతిష్ఠించి తాను శివపూజాధురంధరుని పరమ శివభక్తుని తారకాసురుని దునుమాడినపాపపరిహారమునుఁబొందెను. తరువాత తూర్పు చాళుక్యులచే నీయాలయమంటప ప్రాకారాదులు నిర్మింపఁబడి భూరి భూదానము లొసంగఁబడినట్లు శిలాస్తంభశాసనములు సాక్ష్యమిచ్చుచున్నవి. ఈతూర్పు చాళుక్యలకే వేంగిచాళుక్యులనిపేరు. వీరు "ఏలూరు" సమీపముననున్న "పెదవేగి"ని రాజధానిగాఁజేసుకుని "ఆంధ్ర" సామ్రాజ్యమును పాలించుటచే వీరికి "వేంగిచాళుక్యులనికూడ ప్రసిద్ధనామము కలిగెను. వీరు "ఆంధ్ర" సామ్రాజ్యము నధిష్ఠించినది శకవర్షములు 615. లో



ఏకశిలా ధ్వజస్తంభముతో ఆలయ దృశ్యము



కుమారస్వామి

వీరి ప్రథమపురుషుఁడు 1 వ విష్ణువర్ధన మహారాజు. రాజమహేంద్రవరమును కట్టించిన రాజరాజును యీ వంశమునకు చెందినవాడే. 664 రెండవ విష్ణువర్ధనమహారాజు. ఇతని కుమారుడు మంగియువరాజు 673 శకవర్షములో దివితాలూకాలక్ష్మీపురములో శిలాశాసనమును వ్రాయించెను. శ॥ ౧౦ ౨౨ లో రాజరాజు పాలించెను. (కీల్హారన్ దక్షిణాపథరాజులపట్టిక) వీరె దక్షారామమందుకూడా యాలయనిర్మాణమునుఁగావించి పెక్కుశాసనములను చెక్కించిరి. ఈ రెండును నేకకాలమున నిర్మింపఁబడినట్లు పోలికలను బట్టియు శాసనములనుఁబట్టియు కానవచ్చుచున్నది. ఈ క్రిందిశాసనము ద్వితీయావరణ ముఖమంటపముయొక్క ముందు స్తంభములపై నాలుగుప్రక్కలను చెక్కఁబడియున్నది. శకవర్షంబులు ౧౩౪౪ శుభకృత్సంవత్సరములో మంత్రి ప్రెగ్గడ సూరన్నగారు శ్రీ భీమేశ్వర వారికి ముఖమంటపము కట్టించినట్లు యీ శాసనములో కలదు.

స్వస్తిశ్రీ శాలివాహన శకవర్షంబులు ౧౩౪౪ అగునేంటి శుభకృత్సంవత్సరపుష్య శు ౧ ఆ నాండు మకర సంక్రమణ పుణ్యకాలమున శ్రీ కుమారారామ చాళుక్య భీమేశ్వరదేవర నగరికి నిలువువాకిలి (జి. న) మంత్రి ప్రెగ్గడ సూరన్నగారు ఆ చంద్రార్కముస్నూ అవునట్టుగాను శ్రీస్వామివారికి శ్రీ ముఖమంటపం గట్టించి సమర్పణజేసెను. శ్రీ శ్రీలంజె యును. అది నిలువుమంటపము. సూరన్నగారు కట్టించెను. ఇట్లె అల్లాడభూపాలుని కుమారుఁడు వేమారెడ్డింగారు బిడాలపాలములో ఖ౧ పొలమును సర్వకర పరిహారంగా (యేవిధమైన శిస్తులేకుండా) యీనాముగా శ్రీ భీమేశ్వరస్వామివారికి సమర్పించినట్లు "జగదుదయనవణ....న్నపాతు భీమేశః - స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౫౬ అగునేటి ఆనందనంరపుష్యబ ౧౩ బుధవారం ఉత్తరాయణ మకరసంక్రాంతి పుణ్యకాలమందు శ్రీ మత్కుమారారామ చాళుక్య భీమేశ్వర శ్రీ మన్మహాదేవరలకు అల్లాడ భూపాలుని కుమారుడు వేమారెడ్డింగారిడవులు జియ్యమల్లహనమ్మ తమకు సకీయసుకృతానకు బండాల పొలములో ఖ౧ క్షేత్రమును సర్వకర పరిహారముగా ఆ చంద్రార్కముగాను భీమేశ్వరమహాదేవర్లకు నవర్షము సమర్పించెను." అని కలదు.

ఇంక 1416 శకవత్సరమున పాలూరివియ్యనాయకుని కుమారుఁడు యెఱ్ఱనాయనిగారు ఏకానదివల్లనుండి యేర్ల



మూలవిరాట్ లింగము



చండీశ్వర సహితముగు లింగము - పానవట్టము

త్రవ్వించి, గురుగడ్డంగలి చేనులో తమ తల్లిదండ్రులకు సుకృతముగాను శ్రీ భీమేశ్వర మహాదేవరకు భూదానముఁ జేసినట్లు చెక్కింపఁబడియున్నది.

"శుభమస్తు - శ్రీరామ....గోత్రతిలకః

పాలూరి....మపుత్రో విరమ....సుజసః పాతు....సమర్ప యితుం శ్రీమదిందిరాంగోవాడప్రాంత రాంచితాంగురు గడ్డ సమన్వితాం కుమారారామనాథాయ భీమేశాయ జగద్గురోః ఆ చంద్రార్కం యథాభూతా తథావాపీసీతరాప్రభుః స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౪౧౬ అగు నేటి ఆనంద సం॥ ర పుష్యశు ౧౦ సోమవారం ఉత్తరాయణ మకర సంక్ర మణ పుణ్యకాలమందు శ్రీ మత్కుమారారామ చాళుక్య భీమేశ్వర శ్రీ మన్మహాదేవరకు పాలూరి వియ్యనాయని కుమారుఁడు యెఱ్ఱయనాయనిగారు ఏలానదిపల్లనుండి యేలుఁతలిఁ నది త్రవ్వించి గోవాడపాలిమేరలోంగాను తిర్చిగుడుగడ్డంగలిజ తమ తలిదండ్రులకు సుకృతము గానున్ను తమ పితాదికులకు అక్షయ పుణ్యలోకప్రాప్తి గాను భీమేశ్వరదేవరలకు ధారాపూర్వకముగాను సమర్పణచేసెను. యీ ధర్మము యెవరైనా పాలించ్చక విరుద్ధంగా నడిచిన కాశిలో గోహత్య బ్రహ్మహత్యాదిపాతకాలు చేసిన పాపాలనుబొంది వెయ్యేండ్లు మహారౌరవాదిసర కాలం గూలువారు. మంగళంమహా శ్రీ శ్రీలంజేనును॥ ఇది స్తంభమునకు నాలుగువైపులను కలదు. ఇట్టివింకను కలవు.

## ఉత్సవములు - అర్చన

ఈక్షేత్రమున సంవత్సరాదిని పంచాంగ శ్రవణము ఆశ్వయుజశుద్ధ పాడ్యమి మొదలు దశమి పర్యంతము దేవీనవరాత్రములు, విశేషపూజలు, భోగములు అలంకారములు గ్రామోత్సవములు, పారువేట, కార్తీకశుద్ధపౌర్ణమికి కృత్తికాదీపోత్సవము, మాఘబహుళ ౧౧ ప్రభృతి అమావాశ్యపర్యంతం పంచాహ్నిక దీక్షతో బ్రహ్మోత్సవము జరుగును. మాఘబ ౧౧ లు కళ్యాణము. ఇచ్చట నిత్యార్చనముగాని వార్షికోత్సవ బ్రహ్మోత్సవములుగాని అమరారామ దక్షారామముల క్షీరారామములవలె వెలనాటి వైదికార్చకులచే వైదికాగమానుసారము జరిగించుటాచారమైయున్నది. మంగళమ్.



మహిషాసురమర్దని



ఛాయా పద్మినీ సమేత శ్రీ సూర్యనారాయణస్వామి

# విశేషపూజలు - ఉత్సవములు

పండిత, పార్థసారథి భట్టాచార్య.

చైత్రమాసము :—చాంద్రమాస చైత్రశుక్లపాడ్యమి ఒక గొప్ప పండుగదినము. ఇది సంవత్సరాది, ఉగాదియని వ్యవహరింపబడుచున్నది. వసంత ఋతువుకూడ చైత్ర మాసముతో ఆరంభించబడుననియనుట కలదు. శ్రౌత పారిభాషికముగ వసంతర్తువు ముందే ప్రారంభమగును. ఐనను చైత్రమాసమునే ఆరంభముగ వ్యవహరింతురు. ప్రజలకు ఈసమయము అత్యంతసుఖప్రదముగ నుండుట లోకానుభవము. ముందుఋతువులందుండెడి శైత్యము గాని రాగల గ్రీష్మర్తువున నుండెడి యెండవేడిమిగాని లేక సహ్యమగు శీతోష్ణము కలట్టి కాలమిది. ఈమాసములలో రైతులు వ్యవసాయసంబంధమైన భారపుపనులు లేక విశ్రాంతిననుభవించుదురు. శృంగారరసానుభూతికి అనువగుకాలమని వసంతకాలమును రసికులు పొగడుట సహజముగనున్నది. చైత్రశుక్ల పాడ్యమిదినముతో ప్రాత సంవత్సరము ముగిసి క్రొత్తసంవత్సరము ప్రారంభ మగుటచే ఈ దినమును పండుగదినముగ కొనియాడు చున్నారు. సౌరమానరీతిని కూడ చాంద్రసంవత్సరాది నాటికి సమీపముననే వత్సరాదివచ్చుట కలదు. సౌర చాంద్రవత్సరారంభములకు ప్రాయికముగ యిరువది దిన ములవరకుకూడ వ్యవధానము కలుగుట కలదు. సమీప మునకూడ రావచ్చును. సౌరవత్సరాది యనిన మేష సంక్రాన్తి దినము. సౌరమానమును వాడుకొనువారలు కూడ చాంద్రవత్సరాదిదినముసే పండుగదినముగ అనుష్ఠించుటకలదు. సౌరవత్సరాది సంక్రాన్తి దినమున నగుటచేతను సంక్రాన్తి దినము పితృ దినమై తర్పణాదుల జేయుటకు విహితమైనదగుటచేతను విశేషించి సౌరవత్స రాదిని పండుగదినముగ నా సంప్రదాయపువారును ఆదరించుటలేదు. కావున చైత్రశుక్ల పాడ్యమి దాక్షిణాత్య దేశములందుండు నందరకును పండుగదినమే. కేరల దేశమందు సింహసంక్రాన్తిని వత్సరాదిగ వాడుదురు. ఘూర్జరదేశమున దీపావళిని క్రొత్త సంవత్సరముగ కొనియాడుదురు.

సంవత్సరాదిశుభదినమందు నూతనవస్త్రములను ధరించుట ఆంధ్ర సోదరులయందలి యాచారము. నూతన వస్త్రధారణమును నియతముగ దీపావళి దినమున అరవ దేశమువారు అనుష్ఠించుచున్నారు. పేదసాదలు సైతము సంవత్సరాది దినమున అభ్యంగస్నానము చేసికొని నూతన వస్త్రములను ధరించి నింబ కుసుమమును క్రొత్త చింత పండు పులుసు, బెల్లము, మామిడికాయ ముక్కలు, మొద లగు కపంబ పదార్థమును చేసి తమ గృహములలో దీపారాధనలుచేసికొని గృహార్చన దేవతకో యేపటమునకో నివేదనముచేసి యథాశక్తిగ తమ ఇష్టజనమును ఆహ్వా నించి సత్కరించి నూతన పంచాంగమును స్వయముగనో పురోహితుని మూలముననో చదివిగాని చదివించిగాని నింబ కుసుమ భక్షణమును గావించి పండుగవిందు భోజనము నారగింతురు.

ప్రతి ఇంటను ఆచరించెడి ఈ పండుగను సమిష్టిక్షేమ మునకై యేర్పడిన దేవాలయములందు విధిగా పూర్వులు ఆచరించుచూ వచ్చుచున్నారు. ఈ దినమున నుదయముననే శ్రీ స్వామివార్ల నిత్యపూజనుచేసి విశేష తిరుమం జనముచేయవలెను. తిరుమంజనముయొక్క మహిమ అతిశయితగౌరవము కలది. పంచామృతస్నపనము నారం భించి శుద్ధస్నపనము అలంకారస్నపనములను పురస్కరించి కొని అష్టోత్తరశతకలశస్నపనమువరకు చేయవచ్చును. స్నపనానన్తరము భగవానుని నాస్థానమండపమున వేంచే పించి అలంకరించి విశేషపూజనుచేసి మహానివేదనము చేయవలెను. భగవత్సన్నిధానమున నూతనపంచాంగమును వినిపించి భక్తులలో వారివారికి పలయు ఫలములను చెప్పి క్రమముగా తీర్థ ప్రసాదముల నొసంగి పంపవలయును. ఆవల రాత్రికి గ్రామప్రదక్షిణము ఉత్సవము వినోదముల నాచరింప వచ్చును. విభవము తక్కువగానున్న యెడల రాత్రివేళను స్వామిని ఆస్థానమున వేంచేపించి పంచాంగ శ్రవణమును మాత్రముచేసి తీర్థ ప్రసాద వినియోగము చేయుచున్నారు.

ఈ దినమును వసంతనవరాత్రారంభమని పిలుచుట కలదు. పాడ్యమిదినమారంభించి తొమ్మిది దినములు విశే షోత్సవములు జరిపించుటయు కలదు. ఈ శుభదినము లలో శ్రీ రామాయణపారాయణమును చేయుటయు కలదు.

తిరుమలలో శ్రీ శ్రీనివాసమూర్తి ఆలయమునందు చైత్ర శుక్ల పాడ్యమిదినమారంభించి నిత్యోత్సవమని పేరిట చైత్ర బహుల అమావాస్యవరకు ముప్పది దినములు సాయంకాలమున శ్రీ స్వామివార్లకు గ్రామోత్సవము విశేషా రాధనము జరుపబడుట ఆచారమునందు వచ్చుచున్నది. ఈ యుత్సవము శైవవైష్ణవభేదము కలది కాదు.

శ్రీరామనవమి :—వైఖానస భగవచ్ఛాస్త్రసంహితల నను సరించి మాఘ శుద్ధ ౧౨ పునర్వసు నక్షత్రమున శ్రీరామ

జన్మోత్సవము ఉక్తమైనను దేశాచారముననుసరించి చైత్ర శుక్ల నవమినాడియుత్సవము అన్నిదేవాలయములందును జరుగుచున్నది. కొన్ని ఆలయములలో శ్రీరామనవమికి ముందుగా ఉత్సవమారంభింపబడి శ్రీరామనవమినాడు సీతాకళ్యాణము జరుపబడుచున్నది. కొన్నిచోటులలో నవమి ఆరంభింపబడి దరిమిలా ఉత్సవాంతము త్రయాహ్ని కముగనో పంచాహ్నికముగనో జేయబడుచున్నది. రామాలయములు కానిచోటులందు అనగా శ్రీకేశవస్వామిమొదలగు నాలయములందుకూడా రామకృష్ణ విగ్రహములు ప్రత్యేకముగ ప్రతిష్ఠింపబడు నాచారముకలదు. అట్టి ఇతరాలయములందును శ్రీరామనవమినాడు రామజన్మోత్సవము కృష్ణాష్టమినాడు కృష్ణజన్మోత్సవము చేయుట అవసరము. దీనికి శాస్త్రసమ్మతి కలదు.

చైత్ర శు ౧ నాడు సూర్యోదయకాలమున ప్రతిపత్తిథి ఉండిన యెడల ఆ దినమే పండుగ యగును. చైత్ర మాసము అధికమాసము తటస్థించినను అధికమాసప్రతిపత్తిథియే పండుగ దినము.

వైశాఖ స్నానము.

'మధుమాసస్య శుక్లాయామేకాదశ్యాముపోషితః
పంచదశ్యాం చ భోవీర మేషసంక్రమణేతువా
వైశాఖస్నాననియమం బ్రాహ్మణానామనుజ్ఞయా
మధుసూదనమభ్యర్చ్య కుర్యాత్సంకల్పపూర్వకమ్'

అను పాద్మపురాణవచనముచే వైశాఖస్నానము భగవద్దర్శనము చెప్పబడినది. స్నానము జేయుటకు మంత్రము కూడ ఇట్లు చెప్పబడినది.

'వైశాఖం సకలం మాసంమేషసంక్రమణేరవేః
ప్రాతః సనియమఃస్నాస్యేప్రీయతాం మధుసూదనః
మధుహన్తుః ప్రసాదేస బ్రాహ్మణానామనుగ్రహాత్
నిర్విఘ్నమస్తు మేపుణ్యం వైశాఖస్నానమన్వహమ్
మాధవేమేషగే భానౌ మురారే మధుసూదన
ప్రాతఃస్నానేనమే నాథఫలదోభవ పాపహన్' అనునది స్నానమంత్రము. మరియు నిట్లే ఇంకను విశేషము అక్కడనె కలదు.

'తులసీ కృష్ణగౌరాఖ్యాతయాభ్యర్చ్య మధుద్విషమ్
విశేషేణతువైశాఖే నరోనారాయణో భవేత్
మాధవం సకలంమాసం తులస్యాయోర్చయెన్నరః
త్రిసంధ్యం మధుహన్తారం నాస్తితస్య పునర్భవః'

ప్రాతస్స్నానభగవద్దర్శనానంతరము అశ్వత్థప్రదక్షిణము మహాఫలప్రదము.

'ప్రాతస్స్నాత్వా విధానేన మాధవే మాధవప్రియమ్
యోఽశ్వత్థమూలమాసించేత్తో యేనబహునాతదా
కుర్యాత్ప్రదక్షిణంశంతు సర్వదేవమయంతతః
పితృదేవమనుష్యాశ్చ తర్పయేత్సచరాచరమ్
యోఽశ్వత్థమర్చయేదేవముదకెన సమన్తతః
కులానామయుతంతేన తారితంస్యాన్న సంశయః
కండూయప్పృష్ఠతోగాంతు స్నాత్వాపిప్పలతర్పణమ్
కృత్వా గోవిందమభ్యర్చ్యన దుర్గతిమవాప్నుయాత్'

చైత్ర వైశాఖమాసము ప్రపాకార్యము దానవిశేషములు కూడ చెప్పబడుచున్నవి.

'ప్రపాకార్యాచ వైశాఖే దేవేదేయాగలన్తికా
ఉపానద్వ్యజన ఛత్రసూక్ష్మవాసాంసి చందనమ్
జలపాత్రాణి దేయాని తథాపుష్పగృహాణిచ
పానకానిచ చిత్రాణి ద్రాక్షారంభాఫలాన్యపి'

వైశాఖమాసము :—(అక్షయ్యతృతీయా)

**అక్షతృతీయ :**—వైశాఖ శు 3 దినము అక్షతృతీయ యనునది ధర్మశాస్త్రములందు అత్యన్త మహిమగలదిగ చెప్పబడుచున్నది. బదరికాశ్రమమున జ్యోతిర్దర్శనము ఈ శుభదివసముననే జరుగును. ప్రతిసంవత్సరము అశ్వయుజ బహుళ అమావాస్య రోజున పూజను నిలిపిన తరువాత ఆరుమాసముల కాలము దేవతల పూజ జరిగెడి బదరికాక్షేత్రమున ఈ దినముననే భగవదాలయ ద్వారము తెరువబడి మానవుల ఆరాధనకు శ్రీ నారాయణుడనుమతినిచ్చుచున్నాడు. పూజ నిలుపుదలచేయునపుడు ఆరోపము చేయబడిన దివ్యజ్యోతి తిరిగి అక్షతృతీయనాడు ద్వారములు తెరచునప్పటికి నిర్వాణము కాక ఆరుమాసముల కాలము ఆ ప్రథమ దినమున సమర్పింపబడిన అజ్యముతోను వర్తికతోడను నిరంతరముగ నిరపాయముగ ప్రజ్వలించుచుండును. ఈ దినమున జ్యోతిర్దర్శనము చేయుటకు భారతదేశమందలి నాల్గుమూలలనుండి భక్తజనులు వేల సంఖ్యగ బదరియాత్రకు పోవుదురు. సమీపస్థులుగ నుండెడి ఉత్తరహిందూస్థానప్రజలీసేవార్థిజనములో నధిక సంఖ్యాకులుగనుండుదురు. రానురాను మోటారు మొదలగు ప్రయాణ సౌకర్యములు అధికమగుచుండుటచే దక్షిణభారతమందుండిగూడ ఇప్పుడిప్పుడు కొంచెమధిక సంఖ్యతో యాత్రకు పోవుచున్నారు.

ఆంధ్రప్రదేశమందలి సింహాచల దివ్యక్షేత్రమున శ్రీ వరాహ నరసింహుని ఆలయమున అక్షతదియ విశేష దినముగ కొనియాడబడుచున్నది. సాలగ్రామమూర్తియని ప్రశంసించెడి మూలవిరాట్టు దివ్యమంగళ విగ్రహమునకు ఒక సంవత్సరకాలము ప్రతిదినము సమర్పింపబడెడి చందన కవచమును ఒక్కసారిగ ఈ దినము సడలించి శ్రీవారి నిజస్వరూపమునకు స్నపనతిరుమంజనముల గావించి విశేషోత్సవము చేసి నిజస్వరూపము నియుక్తదినము మాత్రమే భక్తుల దర్శనమున కనువుగ చేయుదురు. మరు

నాటినుండియు ప్రతినిత్యము పై అక్షతదియ వరకు క్రమముగా నిర్మాల్య విసర్జనములేక పైపైన చందనకవచమును సమర్పించుచునే వత్తురు. ఆ రీతిగ నిత్యము చందన సమర్పణచే శ్రీవారి విగ్రహము నిజస్వరూపము మరుగుపడిపోవుట తటస్థించును.

ఈ దినము యుగాది పుణ్యకాలముకూడ నై యున్నది. ఈ దినము పరశురామావతార దినమనికూడ కలదు.

'వైశాఖస్య సితేపక్షె తృతీయాయాం పునర్వసౌ
నిశాయాః ప్రథమేయామె రామాఖ్యః సమయేహరిః'
స్వోచ్చగైఃషడ్గ్రహైర్యుక్తె మిథునెరాహునంస్థితె
రేణుకాయాస్తుయోగర్భాదవతీర్ణోహరిఃస్వయమ్

ఇట్లె దశావతార జయన్తి దినములును అనుష్ఠానయోగ్యములుగ పురాణ సముచ్చయమున నిట్లు కలదు.

'చైత్రేతుశుక్ల పంచమ్యాం భగవాన్మీనరూపధృత్
జ్యేష్ఠేతుశుక్ల ద్వాదశ్యాంకూర్మరూపధరోహరిః
చైత్ర కృష్ణనవమ్యాంతు హరిర్వారాహరూపధృత్
నరసింహశ్చతుర్దశ్యాంవైశాఖేశుక్ల పక్షకే
మాసి భాద్రపదేశుక్ల ద్వాదశ్యాంవామనోహరిః
రాధశుద్ధ తృతీయాయాం రామోభార్గవరూపధృత్
చైత్రశుక్ల నవమ్యాంతు రామోదశరథాత్మజః
నభస్యేతు ద్వితీయాయాం బలభద్రోభవద్ధరిః
శ్రావణెబహులేఽష్టమ్యాంకృష్ణో భూల్లోకరక్షకః
జ్యేష్ఠేశుక్ల ద్వితీయాయాంబౌద్ధః కల్కిర్భవిష్యతి'

## నృసింహజయంతి

వైశాఖ శు ౧౪ దినమందు శ్రీ నృసింహావతార దినము అనుష్ఠింపబడుచున్నది. ఇది ఆంధ్ర దేశాచారము. అరవపువారు స్వాతినక్షత్రమును శ్రీ నృసింహావతారదినముగా చేసికొని వైశాఖశుద్ధమందలి త్రయోదశినిగాని చతుర్దశినిగాని జయంత్యనుష్ఠానము చేయుదురు.

## నరసింహకోలలు

నరసింహజయంతి రోజున నరసింహస్వామి దేవాలయములలో ఈ యుత్సవము జరుగుట ప్రాచీన కాలమున యెక్కువ వాడుకలోనుండెడిది. బందరు పట్టణమున నరసింహ సన్నిధులలో ప్రబలప్రాశస్త్యమును వహించిన బందరుకోట నరసింహస్వామి జలాల్‌పేట నరసింహస్వామి ఆలయములలో ఈ నరసింహ కోలల ఉత్సవము మహా వైభవముగ జరుగుచుండెడిది.

ఆ యుత్సవపద్ధతి ఇట్లుండును. నరసింహవర ప్రసాదముతో జన్మించిన కొందరు వ్యక్తులు అక్కడక్కడ ఉందురు. ఈ కోలల ఉత్సవసందర్భమును ముందు వారలకు ఉత్సవకర్తలు తెలియజేయుదురు. ఆ నియత వ్యక్తులు తాముగానే ఉత్సవమును స్వయముగా నెరవేర్చుటకు సంకల్పింతురు. ఉత్సవము ప్రాయికముగ రాత్రి వేళలందే జరుగుట వాడుక. ఉత్సవదినమున ప్రాతఃకాలమున లేచిన 'కోలల వారు' స్నానముచేసికొని ఉపవాసవ్రతమున సాయంకాలమువరకు నియమముతో నుందురు. ఈ కోలలవారు నాకు తెలసినంతవరకు బ్రాహ్మణేతరులుగనే ఉండిరి.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలోకూడ ఉండవచ్చును. సాయంసమయమున మరలస్నానముజేసికొని మడివస్త్రములగట్టికొని దేవాలయమునకు వచ్చెదరు. మామూలు ప్రేలికలతో చుట్టిన కోలలను నూనెతోతడపి వెలిగించి ఆ కోలలను చేతనుంచి త్రిప్పుచు వానిపై ధారధారలుగ చేతితో నూనెను పోయుచు ఆ కోలలనుండి జారిపడెడి మండెడి నూనెను నోరుతెరచి నాలుకమీద పడునట్లు చేయుచును శరీరమందంతటను ఆ మంటమండెడి నూనె పడునట్లు చేయుచును నృసింహనామాంకితములగు పాటలను కీర్తనములనుపాడుచు ఒడలుతెలియక నృత్యము జేయుదురు. వారలకు వేడినూనె నోటిలోగాని శరీరమందు యెచ్చటగాని పడుటచే ఎట్టి గాయముగాని బాధగాని కలుగుటలేదు. ఈ నృత్యము పందలాదిగ జరుగును. వారి కాయాసము కూడలేదు. ఈ కోలల ఉత్సవమును నృసింహ జయంతి నాడేగాక భక్తులు ప్రార్థనలుచేసికొని వారి కిష్టమగు ఇతర దినములందుగూడ 'కోలలవారిని' నియమించి ఉత్సవములజేసి ప్రార్థనలు తీర్చుకొని అభీష్టములనందుట ప్రసిద్ధము.

ఈ యుత్సవము ఇంకను ఏయే ప్రాంత్యములలో ఆచరణమందున్నదీ వివరములు తెలియదగియున్నది.

'వైశాఖేశుక్ల పక్షేతుచతుర్దశ్యాం నిశాముఖే
మజ్జన్మ సంభవం పుణ్యం వ్రతం పాపప్రణాశనమ్
వర్షే వర్షేతుకర్తవ్యం మమ సంతుష్టి కారణమ్'

ఈ వ్రతము సంయోగ పృథక్త్వన్యాయమున నిత్యము ను కామ్యమునగుచుండుటచే ఆచరించకుండుట ప్రత్యవాయజనకముగూడ నగుచున్నది.

## హనుమజ్జయంతి

వైశాఖ బ ౧౦ తిథిని హనుమజ్జయంతి యని ఆంధ్ర దేశమందనుష్ఠానము. వైఖానస శాస్త్రమందు శ్రావణమాస శ్రవణ నక్షత్రము హనుమదవతార కాలముగ చెప్పబడినది. పుష్యమాసముననని కొన్ని గ్రంథములందు కలదు. అరవ దేశమందలి పెద్దలు ధనుర్మాసమున జ్యేష్ఠానక్షత్రమున నాచరించునట్లు తెలియుచున్నది. ఈ భేదానుష్ఠానముకూడ కల్పభేదమున నిర్వాహ్యమని నిర్ణయించుకొని ఆయాచోటు

లందలి శిష్టుల ఆచారముననుసరించి ఈ యనుష్ఠానమును జరుపుకొనవలయును.

'యత్రయత్ర రఘునాథకీర్తనం తత్రతత్ర కృతమస్త కాంజలిమ్
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్'

అనినట్లు శ్రీ రామాయణ కథాశ్రవణము హనూమంతునకు ధారకము పోషకము భోగ్యము గనుక ఈ శుభదినమందు (ఆమూలాగ్రముగ రామాయణ పారాయణమునకు ముందుగా సంకల్పముచేసి) రామాయణ పట్టాభిషేకము చేయుటగాని అశక్తులగు వారు కేవలమొక్కదినమైనను సుందరకాండ పారాయణమును చేయుటగాని మంచిది. రాత్రియో పగటివేళనో ఆ స్థలమున ప్రధాన దేవునికిని శ్రీ అంజనేయమూర్తికిని గ్రామోత్సవము చేయ వచ్చును.

అంజనేయమూర్తికి 'ఆకుపూజ' అను పేరుతో లేత తమలపాకులతో సహస్రనామార్చనము (వేయి ఆకులను నమర్పించుట) అంధ్రప్రాంత్యమున శిష్టాచారముగ వచ్చుచున్నది. అంజనేయ సహస్రనామముకూడ ఆయా ప్రదేశమందలి ఐతిహ్యమును ప్రకటించుచు వేరువేరు విధముగ ఆచారముననున్నది. 'ఆకుపూజ' తోపాటుగ బియ్యపుపిండి బెల్లము యేలకలు చేర్చి చక్కని మృదు మధురపాకమున శ్రద్ధతో నేతితోచేసిన గుడాపూపములు (అప్పములు)ను నివేదించుటగూడ శిష్టాచారము కలదు. 'పానకము వడపప్పు పంచకజ్జాయము' ననునవి అంధ్రమండలముల సాధారణ ఆలయ ప్రసాదములు. వసంతకాలమగుటచే మల్లెపూల దండలను నమర్పింతురు. ఇట్లే 'వసన్తమాధవ పూజ' యని సంకల్పించి శ్రీరామనవమి - శ్రీ నృసింహ జయన్తి - హనుమజ్జయన్తి ఉత్సవములలో పరిమళితమగు చందనము భగవన్నిర్మాల్యమగు పూలదండలు విసనకఱ్ఱలు మామిడిపండ్లు (భగవన్నివేదిత పదార్థములు) యథాశక్తి దక్షిణలతో తాంబూలములను భగవదాలయములలో ఆస్తికులగు భక్తులు వైదికాచార సంపన్నులగు భాగవతులకు నమర్పింతురు. మొదట భగదుపసర్పణము అవల భాగవత పూజతో 'వసంత మాధవపూజ'ను అంధ్ర సోదరులు విరివిగా అనుష్ఠించుట కలదు. ఆలయములలోనే గాక సంపన్నులగు గృహస్థులు తమ ఇండ్లలోగూడ తప్పక వసంతకాలము అరువది దినములలో ఒక్కదినమైనను 'వసంత మాధవపూజ' నాచరించుట కలదు.

అరవదేశమునను అరవదేశమునకు సన్నిహితమగు అంధ్రభూమియందును అంజనేయునకు తరుచుగా ఆదివార దినములందు 'వడమాల' అను పేరుతో మాషాపూపములు (మినపగారెలు) పరిశుద్ధమగు ఆజ్యముతో జేయించి వానిని శ్రీ అంజనేయుని బింబము పాదవున నుండునట్లు దండగా గ్రుచ్చి మెడలో నమర్పింప జేయుటకలదు. అంధ్రదేశమున ఈ యాచారము చాలవిరలమైయున్నది.

అంజనేయమూర్తికి అభిషేకము చాల ఇష్టము. అభిషేకానంతరము ఇతర దేవతా విగ్రహములవలెగాక ఆ బింబమునకు 'గంగసిందూరము' వెన్నతోగాని నేతితోగాని కలిపి వర్ణముచేయుట చాల ప్రదేశమందాచారము కలదు. అట్టి సంప్రదాయము అవిచ్ఛిన్నముగా నడచుచున్న చోటులందా ప్రకారము చేయవచ్చును. ఈ సిందూరమును ప్రసాదముగ భక్తులు తీసికొని నొసట నలంకరించుకొనియెదరు.

అంజనేయుడు భూతబాధను నివృత్తిచేయగల దైవము. భూతబాధలుకలవారలు సంతానములేనివారలు అంజనేయుని ఆలయమునకు నియమముతోనుండి ప్రదక్షిణాదులు జేసి ఇష్టార్థములను బడయుచున్నారు. కాగా హనుమజ్జయన్తి ప్రతి ఆలయమునను జరుప దగిన గొప్ప ఉత్సవ విశేషముకాగలదు.

హనూమంతుడు ఏకముఖుడుగను పంచముఖుడుగను బహుముఖుడుగను ఉపాసింపబడుట కలదు; 'అన్యత్ర భీష్మాద్గాంగేయాదన్యత్ర చ హనూమతః।...మోహితం జగత్' అనునట్లు అంజనేయుడు నిరత బ్రహ్మచారిగను పక్షాన్తరమున సువర్చలయను భార్యతో గృహమేధిగను కూడ ఉపాసింపబడుచున్నాడు. ఇది పూర్వము నిర్ణయింపబడినట్లు కల్పాంతరవిషయముకానగును. వీరాంజనేయులు ప్రసన్నాంజనేయులు శృంఖలాబద్ధులు అను మొదలగు ననేకరూపములతో అంజనేయులు వెలయుచున్నారు.

ప్రధానమూర్తి హనూమంతుడుగనున్న హనూమదాలయములలో ధ్వజారోహణపూర్వకముగ సంవత్సరోత్సవము కల్యాణోత్సవము మొదలగునవి జరుపబడుచున్నవి.

**ఆషాఢమాసము**:-దక్షిణాయన పుణ్యకాలము - కర్కాటక సంక్రాన్తిపుణ్యకాలము.

శయనైకాదశి – (తొలి ఏకాదశి) (శుక్లైకాదశి) మహావిష్ణువు క్షీరాబ్ధియందు యోగనిద్రకై వేంచేయు దినమిది యని చెప్పుదురు. ఏకాదశినాడు ఉపవాస వ్రతమనుష్ఠించుట అవసరమని తలచెడివారలు అన్ని ఏకాదశులను అనుష్ఠించినను ఉదాసీనముగ నుండినను ఉపవాస వ్రతమును తప్పక అచరించెడి కాలములలో నిదియొక ముఖ్యమైన ఏకాదశిగనున్నది.

'ఏకాదశ్యాంతు శుక్లాయామాషాఢే భగవాన్హరిః
భుజంగశయనే శేతే క్షీరార్ణవజలెసదా' అనియు
'క్షీరాబ్ధౌ శేషపర్యంకే ఆషాఢ్యాం సంవిశేద్ధరిః
నిద్రాంత్యజతి కార్తిక్యాంతయోః సంపూజయేత్సదా
బ్రహ్మహత్యాదికంపాపం క్షిప్రమేవ వ్యపోహతి
హింసాత్మకైస్తుకింతస్య యజ్ఞైః కార్యంమహాత్మనః
ప్రస్వాపేచ ప్రబోధేచ పూజితోయేనకేశవః' అనియు
'ప్రతిపర్వంచయః కుర్యాదేవం వైసంస్మరన్హరిమ్
దేహాన్తేఽతిప్రదీప్తేన విమానేనార్కవర్చసా
మోదతే విష్ణులోకేఽసౌయావదాభూతసంప్లవమ్' అనియు
'శుచే వాభక్తి సంయుక్తో భానౌవాగణనాయకే
కృత్వా వ్రతస్యనియమం యథోక్త ఫలభాగ్భవేత్'

అనియు ఈ వ్రతము సర్వమతసాధారణ మనియు మోక్షఫలప్రద మనియు చెప్పబడుచున్నది. వ్రతగ్రహణ ప్రకారముకూడ ఇట్లు చెప్పబడినది.

'మహాపూజాంతతః కుర్యాద్దేవదేవస్య చక్రిణః
జాతీకుసుమమాలాభిర్మన్త్రేణానేన పూజయేత్
సుప్తేత్వయి జగన్నాథే జగతత్సుప్తం భవేదిదమ్
విబుద్ధే చవిబుద్ధ్యేత ప్రసన్నోమె భవాచ్యుత
ఏవంతాం ప్రతిమాం విష్ణోః పూజయిత్వాన్వయంనరః
ప్రభాషేతాగ్రతో విష్ణోః కృతాంజలిపుటస్తథా
చతురోవార్షికాన్ మాసాన్ దేవస్యోత్థాపనావధి
ఇమంకరిష్యేనియమం నిర్విఘ్నం కురుమేచ్యుత
ఇదంవ్రతం మయాదేవ గృహీతం పురతస్తవ
నిర్విఘ్నం సిద్ధిమాయాతు ప్రసాదాత్తవకేశవ
గృహీతేఽస్మిన్వ్రతేదేవ పంచత్వం యదిమేభవేత్
తదాభవతు సంపూర్ణం త్వత్ప్రసాదాజ్జనార్దన
గృహీతేఽస్మిన్ వ్రతేదేవ యద్యపూర్ణేమృతేహ్యహమ్
తన్మేభవతు సంపూర్ణం త్వత్ప్రసాదాజ్జనార్దన'

శ్రావణమాసము: వరలక్ష్మీవ్రతము:-ఈ మాసమున పూర్ణిమకు ముందు వచ్చెడి శుక్రవారమునాడు ఈ వ్రత మాచరింపబడుచున్నది. శ్రావణమాసమందువచ్చెడి అన్ని శుక్రవారములుకూడ వ్రతదినములేయైనను పూర్ణిమ ముందు వచ్చెడి శుక్రవారము విశేషదినముగ గ్రహింప బడినది. లక్ష్మి అమ్మవార్లు ప్రత్యేకముగ ప్రతిష్ఠింపబడి ఆరాధింపబడెడి చోటులందు ఈ దినముదయమునుంచి ఆలయములో మహాలక్ష్మికి అభిషేకము విశేషపూజలు నివేదనములు కావించి 'తోరములు'తో అలంకరించి ఆ ప్రసాదమును సుమంగలీ స్త్రీలు స్వీకరింతురు. ఇండ్లలో కూడ ఈ వ్రతమును విస్తారముగ చేయుటకలదు. ఇండ్లలో చేయునప్పుడుకూడ శ్రావణములో సంభవించెడి యే శుక్ర వారమున అనుకూలముగ నుండునో ఆవారము వ్రతా చరణము జేయుటకలదు. ఆలయములలో యీ వ్రతా చరణము జేయుట వైష్ణవమతము వారికి హెచ్చుగనున్నది. తక్కినవారు బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదములేకుండ ఇండ్లలో కలశ ప్రతిష్ఠచేసి ఈ పూజనుచేయుదురు. ఇండ్లలో చేయువారు ఆలయములలోనికి పోయి అమ్మవారి దర్శ నము చేయుదురు. ఈవ్రతము ఆంధ్ర ద్రామిడ భేదము లేక దక్షిణదేశమంతయు ఏకరీతిగ అనుష్ఠింపబడుచున్నది.

ఉపాకర్మ :—ఋగ్వేద యజుర్వేద శాఖల ద్విజులకు శ్రావణపూర్ణిమ ఉపాకర్మ దినముగ చెప్పబడినది. ఒక ప్పుడు ఈ పూర్ణిమ నాటికి మౌఢ్యము గ్రహణము మొదలగు దోషములు సంభవించినప్పుడు ప్రథమోపాకర్మ ఆషాఢమాస ముసగూడ జరుగుట కలదు. ప్రాచీనోపాకర్మ శ్రావణ మందు జరుగును. ఈ దినమున ఒకానొక పుష్కరిణి సమీపమున శ్రీస్వామి వార్లు వేంచేయుటయు వారి సన్ని ధానములో అక్కడి వారలు ఉపాకర్మను జరుపుకొనుటయు కలదు. ఉపాకర్మ చేసికొనినవారుకూడ తమకు అనుకూల మైన తావులందు ఉపాకర్మమును జేసికొని భగవద్దర్శనము జేయుట ముఖ్యము. ఈదినమున శ్రీ స్వామివార్లకు విశేష పూజ జరిపించుట అవసరము.

గాయత్రీజపము :—ఉపాకర్మకు మరునాడు సహస్ర గాయత్రిని జపముచేసి భగవద్దర్శనము చేయవలయును. పూర్ణిమదినమే హయగ్రీవజయన్తి ఆచరించబడుచున్నది.

శ్రావణ్యాం శ్రవణే జాతఃపూర్వంహయశిరాహరిః
జగాద సామవేదంతు సర్వకల్మషనాశనమ్
స్నాత్వాసంపూజయేత్తంతు శంఖచక్రగదాధరమ్
అని కల్పతరువునందు కలదు.

భాద్రపదమాసము: వినాయకచతుర్థి - వినాయక చవితి, పిళ్లారిచవితియని పిలువబడు ఈ పండుగ భారత భూమి యందంతటను ఏకరూపముగ ననుష్ఠింపబడు చున్నది. వినాయకుడు పార్వతిదేవిచే సృజియింపజేయబడిన పుత్రుడనుట లోకప్రసిద్ధము. ఆస్తికులగు వారలు యేపని నారంభించినను వినాయకుని పూజచేయక ఆరంభించుట లేదు. వినాయకుని పూజ శివాలయములందు జరుప బడుట విధిగానున్నది. ఈదినమున వినాయకునకు అభి షేకము మొదలగు విశేషపూజలుజేసి గ్రామోత్సవము చేయవలయును. ఈదినము ప్రాయికముగ హస్త నక్షత్ర ముతోకూడి సంభవించినపుడు సామవేద శాఖవారికి ఉపా కర్మ అనుష్ఠింపబడుచున్నది.

ఈ దినము సాయంసమయమున చంద్రదర్శనము చేయరాదు. అట్లు చేసినవారికి నీలాపనిందలు కలుగు ననియు అట్లు కలుగకుండుటకు శ్రీ భాగవతమందలి శ్యమంతకోపాఖ్యానమును పఠించి భగవద్దర్శనము చేసి మంత్రాక్షతలు ధరించ వలయునని చెప్పుదురు.

సింహాదిత్యే శుక్లపక్షే చతుర్థ్యాంచన్ద్ర దర్శనమ్
మిథ్యాభిదూషణం కుర్యాత్తస్మాత్పశ్యే న్నతంసదా।
తద్దోషశాన్తయేః 'సింహప్రసేన'మితివై పఠేత్।
విష్ణుపురాణేః—సింహఃప్రసేనమవధీగ్సింహోజాం బవ తాహతః
సుకుమారకమారోదీఃతవహ్యేషః శ్యమన్తకః।

అనంతవ్రతముః—భాద్రపద శు ౧౪ దినమున అనంత పద్మనాభ వ్రతము ఆచరింపబడుచున్నది. ఈవ్రతము ఆంధ్ర ద్రావిడ భేదములేక ద్విజాతులందు సర్వత్ర అనుష్ఠింపబడుచు వచ్చుచున్నది. ఈ వ్రతము గృహస్థుల ఇండ్లలోనేగాక భగవదాలయములందును అనుష్ఠింపబడి భగవద్దర్శనాదులను లభింపచేయును. వ్రతకల్పము ప్రసిద్ధము.

ఆశ్వయుజమాసము : ఈ మాసము దేవీపూజకు సముచితమైనది. ఇందు పాడ్యమి మొదలు మహానవమి వరకును విజయదశమివరకును సంభవించెడి శుభదినములకు శరన్నవరాత్రమని ప్రసిద్ధికలదు. శివాలయములందు ప్రాయికముగ అమావాస్య వేధలేని ప్రతిపత్తిథి యందు కలశ స్థాపనము విశేషపూజారంభము చేయబడుచున్నది.

ఆశ్వయుజశుక్ల పంచమిదినమున సుపాంగలలితావ్రమును మహారాష్ట్ర దేశస్థులాచరించుచున్నారు.

ఈ నవరాత్రమందు మూల నక్షత్రమున పుస్తకరూప సరస్వతీ పూజారంభము చెప్పబడినది.

'మూలేషు స్థాపనందేవ్యాః పూర్వాషాఢాసుపూజనమ్
ఉత్తరాసు బలిందద్యాచ్ఛ్రవణేన విసర్జయేత్' (దేవీ పురాణము)

'మూలఋక్షే సురాధీశ పూజనీయా సరస్వతీ
పూజయేత్ప్రత్యహందేవ యావద్వైష్ణవీమృక్షకమ్
నాధ్యాపయేన్న చలిఖేన్నాధీయాతకదాచన
పుస్తకే స్థాపితేదేవ విద్యాకామో ద్విజోత్తమః' (రుద్రయామిలం)

ఈ సందర్భముననే సప్తమి ఆరంభించి నవమివరకు దేవీ త్రిరాత్రమను పేరుతో త్రిరాత్రవ్రతమును అనుష్ఠించుట కలదు.

ఆశ్వయుజ శుక్ల అష్టమి మహాష్టమి యనబడి వ్రత చర్యకు చెప్పబడినది. ఇట్లే మూలానక్షత్రముతో కూడిన అష్టమీ తిథి మహానవమి యని కొనియాడబడినది.

'ఆశ్వయుక్ శుక్లపక్షే యాఽష్టమీ మూలేన సంయుతా
సామహానవమీ ప్రోక్తాత్రైలోక్యే పిసుదుర్లభా' అనియు
'ఆశ్వినస్య సితాష్టమ్యా మర్ధరాత్రేతు పార్వతీ
భద్రకాళీసముత్పన్నా పూర్వాషాఢాసమాయుతా' అనియు
'తత్రాష్టమ్యాం భద్రకాలీ దక్షయజ్ఞవినాశినీ
ప్రాదుర్భూతా మహాఘోరా యోగినీకోటిభిస్సహ'
అనియు చెప్పబడినది

### విజయదశమీ

'దశమ్యాంతునరైః సమ్యక్పూ జనీయ్యాపరాజితా
ఐశానీందిశమాశ్రిత్య అపరాహ్ణే ప్రయత్నతః
యాపూర్ణా నవమీయుక్తా తస్యాం పూజాఽపరాజితా
క్షేమార్థం విజయార్థంచ పూర్వోక్తవిధినానరైః
నవమీ శేషయుక్తాయాందశమ్యామపరాజితా
దదాతి విజయందేవీపూజితా జయవృద్ధిదా' అనియు
'శ్రవణర్క్షం యదాకాలె సాతిథిర్విజయాభిధా
శ్రవణర్క్షేతు పూర్ణాయాం కాకుత్స్థః ప్రస్థితోయతః
ఉల్లంఘయెయుఃసీమానం తద్దినర్క్షేతతోనరాః'అనియు
శ్రవణ నక్షత్రముతోకూడిన దశమి తిథియందు అపరాజితా దేవి పూజచేయవలయుననియు ఆ దినమున ప్రజలందరును సీమోల్లంఘనము చేయదగుననియు చెప్పబడుచున్నది. మరియు

'సూర్యోదయె యదారాజన్ దృశ్యతే దశమీ తిథిః
ఆశ్వినేమాసి శుక్లేతు విజయాంతాం విదుర్బుధాః'

అని ఈ దశమికి విజయదశమి యనుపేరు కల్గినదని యున్నది.

మరియు విజయదశమినాడు దేవాలయములలో ప్రాయికముగ పార్వేట ఉత్సవము జరుగుట కలదు. శమీపూజ యను పేరిట శ్రీ స్వామివార్లను గ్రామోత్సవముగా వేంచేపించి ఉద్యానవనముననొక శమీవృక్షమూలమున వేంచేపించి మంత్రపూర్వకముగ వృక్షపూజ గావించి శ్రీ స్వామి వారిచేత ధనుస్సు పట్టించి బాణములను విడిపించుట ఆచారముకలదు. ఆగమములందును నిబంధన గ్రంధములందును ఈ వివరము కలదు. ప్రయోగము వ్రాయుట ఇచ్చట అధికమగును.

'శమీయుక్తం జగన్నాథం భక్త్యా నామభయంకరమ్
అర్చయిత్వాశమీ వృక్ష మర్చయేచ్చతతఃపునః'

అని భవిష్య పురాణ వచనము కలదు. శమీపూజ యందీ దిగువు మంత్రమును పఠియించి శమీపత్రములను అక్షతలను శమీవృక్షమూలమందలి మృత్తికను ప్రసాదముగ గొనిపోవుట కలదు.

"అమంగలానాంశమనీం శమనీందుష్కృతస్యచ
దుఃస్వప్ననాశినీం ధన్యాం ప్రపద్యేహంశమీం శుభామ్"

# విష్ణుమాయ

బులుసు - వేంకటరమణయ్య.

పూర్వకాలంలో పుండరీకుడనే బ్రాహ్మణుడు యమునా నదీతీరానవున్న మధురానగరంలో నివసిస్తూ వుండేవాడు. పూర్వజన్మంలో అతడు చేసుకున్న పుణ్యపరిపాకంవల్ల నైతేనేమి, భగవంతుడైన శ్రీకృష్ణుడు జన్మించిన నగరంలో నివసించడంవల్లనైతేనేమి - అతనికి హరిభక్తి అపరిమితంగా ఉండేది. అదృష్టవశాత్తూ అతనికి అనుకూలవతి అయిన సావిత్రి అనే ఉత్తమురాలు—మహాపతివ్రత సహధర్మచారిణిగా లభించినది. అతడు ప్రతిదినమూ ఉషయాన్నే యమునానదిలో స్నానసంధ్యావందనాలు నిర్వర్తించుకొని, గృహానికివచ్చి, గృహస్థవిహితాలైన అహ్నికాలూ, పంచయజ్ఞాలూ జరిపి, భగవంతునికి నివేదన చెయ్యబడిన చతుర్విధాహారములనూ స్వీకరిస్తూ సుఖంగా కాలంగడిపేవాడు. తాను అనుభవించడానికీ, యితరులకు కాస్తపెట్టడానికీ ఉన్నవాడు కావడంవల్ల అతనికి లోపం అనేదిలేదు. ధర్మచింతనా, భగవద్ధ్యానమూతప్ప మరొక ఆలోచనే అతనికి లేదు. అతడు నిత్యమూ సాలగ్రామరూపంలోవున్న దేవుని పూజిస్తూ వుండేవాడు. ఇతడు ఉత్తముడుకావడంవల్ల, మహర్షులకు కూడా యితనిపద్ధతి బాగా నచ్చి, తరచు ఇతనికి దర్శనం యిచ్చి అనేక విషయాలు చెప్తూవుండడం కద్దు. వారిలో నారద మహర్షికి యితనిమీద అభిమానం ఎక్కువ.

ఒకప్పుడు నారదమహర్షి యీ పుండరీకుని వద్దకువచ్చి అందరికంటే విష్ణువేగొప్ప దేవుడనీ, ఈ ప్రపంచం అంతా అతని మాయావిలాసమే అనీ, సంసారచక్రమంతా విష్ణుమాయా మహామోహవిభ్రమమనీ—వివరించి "సర్వధర్మం బులునుమాని చక్రధరుని ఆశ్రయింపుము" అని బోధించాడు. చిత్సుఖావాప్తికి యిదితప్ప మరొక మార్గంలేదని వివరించి, పుండరీకునివల్ల సత్కారాలు పొంది సత్యలోకానికి వెళ్లిపోయాడు.

నారదుడు వెళ్లిపోయాక పుండరీకునికి ఒక సందేహం కలిగింది. తానేమో హరిభక్తుడే; విష్ణువే దేవతలందరికీ కూడా ఆరాధ్యుడని తనకూ తెలుసును. అయినా—సృష్టి స్థితి లయాలు మూడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనే త్రిమూర్తులయొక్కయీ విలాసాలని ప్రసిద్ధమైవున్నది. సృజించేవాడు బ్రహ్మకాబట్టి సంసారమంతా బ్రహ్మమాయకావలసివుండగా, నారదుడు "ఇది అంతా విష్ణుమాయా విలసితం" అని ఏలాగు చెప్పాడా? అని అతనికి సందేహం కలిగినది. కాని, అవెంటనే—"నారదుడి వంటివాడు చెప్పగా నమ్మకపోవడం యెలాగ?" అని తోచేది. అయినా—దీనికి తగిన దృష్టాంతం కనబడిన తర్వాతగాని నిశ్చయంగా నమ్మకూడదని మనస్సులో అనుకునేవాడు.

కొన్నాళ్లు గడిచాయి. ఆ రోజు పుండరీకుని తండ్రి తిథి. అతడు భోక్తలగు బ్రాహ్మణులను నిమంత్రించి, తగిన యేర్పాట్లన్నీ చేశాడు. అతనిభార్య వంటపనిలో నిమగ్నురాలైవుంది. నదికివెళ్లి స్నానంచేసి, వేగంగావచ్చి పితృకార్యం జరిగించాలని ఆమె చెప్పగా, పుండరీకుడు స్నానానికివెళ్లి, స్నాన, సంధ్యావందనాలు ముగించుకుని, ఒడ్డునవున్న ఒక ఇసుకతిన్నెమీద కూర్చుని జపం చేసుకోవడం ప్రారంభించాడు. కాని, అంతలోనే అతని మనస్సు స్థైర్యం తప్పి, నారదుడు చెప్పిన సంగతి జ్ఞప్తికివచ్చినది. "ఈ ప్రపంచం విష్ణువుయొక్క మాయాకల్పితమే అయితే, నాకు యీ సంసారంకాకుండా మరొక సంసారం యేర్పడి వుండాలి. అలా అయితేనే నమ్మకం కలుగుతుంది. భగవంతుడు నాకా సందేహనివృత్తి కలిగించగలడని నమ్ముతున్నాను"

పుండరీకుడు ఇలా అనుకోవడమే తడవుగా విష్ణుమాయ అతన్ని ఆవేశించినది. అలా ఆవేశించగానే, అతనికి తన విషయమంతా విస్మృతం అయింది. తన సంసారం సంగతీ, ఆనాడు పితృదివసం అనే సంగతీ—పూర్తిగా అతడు మరచిపోయాడు.

అతడు ఆ పులినతలంపై కూర్చుండి ఉండగా—అతనికి ఎదురుగా ఉన్న రేవులో ఒక బోయచిన్నది కాళ్లూ చేతులూ కడుక్కొని, నీళ్లు తాగుతూ కనిపించినది. అది అంగసౌష్టవం కలిగి, నవయౌవనంతో ఉండడంవల్ల చూపరమనస్సును ఆకర్షించడంలో అనుమానమేమీ లేదు. ఆమె చిరునవ్వు నవ్వుతూ, పుండరీకునివైపు ప్రేమఒలికే చూపులను ప్రసరింపజేయసాగినది. ఆ చూపులు తన మనస్సును చలింపజేయగా అతడు ఆ చిన్నదాన్ని చేతిసైగచేసి దగ్గరకు పిలిచాడు. ఆమె ఒయ్యారంగా వచ్చి నిలిచింది. పుండరీకుడు ఆమెవృత్తాంతాన్ని ప్రశ్నించి తెలుసుకున్నాడు. ఆ యువతి కన్య అని తెలియగానే అతని మనస్సు మరీ గంతువేయసాగింది.

"అమ్మాయీ! నువ్వు చాలా అందకత్తెవు. నీవంటిది బోయకులంలో పుట్టడం అరుదు. నీ పుట్టుకవల్ల నీ జాతికే గొప్ప గౌరవం కలిగినది; నువ్వు కోరితే మీ

జాతియువకులు నీకు దాసానుదాసులై నిన్ను పెండ్లాడ డానికి గంతులు వేసుకుంటూ మరీ వస్తారు. నువ్వు యింతవరకూ అవివాహితవుగా వుండడం నాకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది.'' అని అతడు అన్నాడు.

దానికి ఆమె ''అయ్యా! నా వివాహంగురించి, నా తల్లి దండ్రులు చాలా దినాలనుంచి ప్రయత్నిస్తూనే వున్నారు. కాని మా జాతిలో అనుకూలుడు, తగినవాడు అయిన వరుడు ఇంతవరకూ లభించడం లేదు. అందువల్లనే యింకా వివాహం కాలేదు. నీ వంటి వరుడు లభిస్తే నా జీవితం సార్థకమవుతుందని నా అభిప్రాయం. ఇలాంటి సంబంధం దొరికితే మా తల్లిదండ్రులు కూడా చాలా ఆనందిస్తారు. కాని యేమి లాభం? నీ వేమో అగ్రజాతి వాడవు. ఒక వేళ నామీద దయతలచి నీవు పెండ్లాడ దలచినా—ఇంతవరకూ నీకు వివాహం కాలేదని యెలా అనుకోగలను? ఒకవేళ నువ్వు నమ్మతించినా మీ కులం వారు సమ్మతిస్తారా? నన్ను పెండ్లాడితే నిన్ను జాతివారు వెలివేస్తారుగదా! నేను అవివాహితగానే ఉండేటట్లు బ్రహ్మ దేవుడు నా నుదుట వ్రాసినట్లు ఉన్నది'' అని జబాబు చెపుతూ, తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ అంగభంగి మాలవల్ల తనకు అతనిపైని గల అనురాగాన్ని వ్యక్తం చేసింది.

విష్ణుమాయవల్ల పుండరీకుడు తన సంసారాన్నిగురించి పూర్తిగా మరచిపోయాడు. అతడికి—తాను బ్రాహ్మణుడనే విషయం తప్ప మరేమీ జ్ఞప్తిలో లేదు. ఆ బోయచిన్న దానికి తనమీద గాఢమైన ప్రేమ వున్నట్లే తనకూ దానిపై ఎక్కువ మక్కువ వుండడంవల్ల—ధర్మవిరుద్ధమైనా సరే-ఆ కన్యను వివాహం చేసుకోడానికే నిశ్చయించాడు. అతడు వెంటనే ఆ చిన్నదానితో కూడా అక్కడికి కొలది దూరంలో వున్న బోయపల్లెకు వెళ్లి, ఆ యువతియొక్క తల్లిదండ్రులను కలుసుకుని, తన మనస్సంకల్పాన్ని వెల్లడించాడు. ఇలాటి ఉత్తముడు అల్లుడు అవుతూ వున్నందులకు వారు చాలా సంతోషిస్తూ—తమకు ఆ అమ్మాయి తప్ప వేరే సంతానం లేదని, దాన్ని విడిచి వుండడం అసాధ్యమని చెపుతూ—అతన్ని కూడా అక్కడే వుండిపోవాలని కోరారు. దానికి పుండరీకుడు మనసారా సమ్మతించి, ఆ బోయపడుచును పెండ్లిచేసుకుని అక్కడే వుండిపోయాడు. దానితోడిదే లోకమని భావిస్తూవున్న ఆ విప్రుడు కొలది కాలానికే అక్కడి జీవితానికి అలవాటు పడి, ఆహార విహారాదుల్లో వాళ్ల పద్ధతులనే అనుసరించసాగాడు.

ఈ విధంగా—ఇంచుమించు ఇరవై ఏళ్ళు గడిచి పోయినవి. ఈ బ్రాహ్మడికి ఆ బోయపడుచువల్ల ఒక కుమార్తె, ఒక కుమారుడూ కలిగారు. అత్తమామలతోనూ, భార్యాబిడ్డలతోనూ నిర్విచారంగా కాలం గడుపుతూ వుండే వాడు. అతనికి వెనుకటి సంగతి సుతరామూ జ్ఞప్తికి రానే లేదు.

కాలం ఎప్పుడూ ఒక్కమాదిరిగా ఉండదు. ఇన్నాళ్ళూ సుఖంగా కాలం గడిపిన పుండరీకుడు యిప్పుడు కష్టాలను ఎదుర్కోవలసి వచ్చినది. అతడున్న ఆ ప్రాంతంలో వర్షాభావం వల్ల పంటలు పండక కరవు సంభవించినది. ఆ సమయంలో పుండరీకుడు చాలా కష్టపడవలసి వచ్చింది. తిండికి లేక తన కుటుంబంలోనివారంతా మలమల మాడుతూ వుంటే ఇతని కన్నులనుండి నీళ్ళు జలజల కారసాగాయి. రానురాను కరవు ఎక్కువ అయినది; కాని తగ్గుదల చూపలేదు. తిండికి ఏ వస్తువులూ లేక పసు మ్యలు మనుష్యులనే తినే పరిస్థితి ఏర్పడినది. ఈ కరవు బాధకు తట్టుకోలేక అతని అత్తమామలూ, కుమార్తెయూ చనిపోయారు. ఇక అక్కడనే ఉన్నయెడల జీవించడమూ, తన భార్యనూ ఏడాది వయస్సుగల కుమారుణ్ణీ కాపాడుకోవడం అసాధ్యమని తోచి, పుండరీకుడు ఆ దేశం విడిచి సుభిక్షంగా వున్న దేశాంతరానికి పోవాలని నిశ్చయించాడు.

అప్పుడు దక్షిణదేశం కరువులూ కాటకాలూ లేక సుభిక్షంగా వున్నది. దక్షిణభారతదేశంలోని కర్ణాటకప్రాంతం తుంగభద్రానదివల్ల పుష్కలంగా పంటలు పండిస్తూ ప్రజలకు ఎలాంటి కష్టాలూ లేక కాపాడుతున్నది. ద్రావిడదేశం కావేరీనదిమీద ఆధారపడి, ఫలవంతంగా ఉన్నది. కళింగ మధ్యప్రాంతం లాంగుల్యాశారదానదులవల్ల ఫలవంతమై ఉన్నది. వీటన్నింటికన్నా తెలుగుదేశం మరీ సుభిక్షమై ఉన్నది. పవిత్రమైన కృష్ణా, గోదావరీనదులు సర్వకాలాలూ ప్రవహిస్తూ ఉండడంవల్ల అక్కడ ఏ కాలంలోనూ కరువు అనేది వుండనే వుండదు. గోదావరీతీరభూమి మిక్కిలి శ్రేష్ఠమయినది. కొబ్బరితోటలూ, మామిడితోటలూ, పచ్చని పైరులూ కన్నులపండువుగా వుంటాయి. బాటసారులకూ, దరిద్రులకూ భోజనం పెట్టే అన్నసత్రాలు విరివిగా ఉంటవి. ఈ సంగతిని బాగుగా గ్రహించి పుండరీకుడు తన కొడుకును చంకను బెట్టుకుని, ఒక చేత్తో ఉగ్గంకట్టిన గంజికుండనూ, మరొక చేత్తో విల్లమ్ములనూ ధరించి, యీతాకుల చింకి చాపను తలమీద పెట్టుకుని గోదావరీ ప్రాంతానికి బయలుదేరాడు. అతని భార్య అయిన బోయ పడుచు—అతని వెనుకనే కాళ్లు ఈడ్చుకుంటూ రా సాగినది. వాళ్లు మార్గంలో నానా శ్రమలూ పడి ఎలాగైతేనేమి చివరకు గమ్యస్థానమైన గోదావరీతీరాన్ని చేరుకున్నారు. అంతటితో పుండరీకుని మనస్సు కొంత నెమ్మదిపడినది. అతని భార్యకుకూడా కొంత సంతృప్తి కలిగింది. వారిద్దరూ ఆ గోదావరి నీటిలో కాలుసేతులూ, మొగమూ కడు

క్కని, మధురమైన ఆ నీటిని తాగి, కొంతసేపు సేద దీర్చుకున్నారు. తర్వాత పుండరీకుడు తన భార్యనూ, చిన్న కుమారుడినీ ఆ దగ్గిరున్న ఒక చెట్టునీడలో కూర్చుండబెట్టి, ఆ పక్కనే వున్న గ్రామంలోకి భిక్షార్థం వెళ్లి ఒక యింటి గుమ్మంలో నిలబడి "అమ్మా! పట్టెడన్నం వుంటే పెట్టు తల్లీ!" అని గట్టిగా అరిచాడు. ఆ వూరు ఒక అగ్రహారము కావడంవల్ల అక్కడివారు బిచ్చం వేస్తారని అతని తలపు. అతడు నిలిచి వున్న గృహం ఎంతో కలకలలాడుతూ, లక్ష్మీదేవి తాండవిస్తున్నట్లువుండడంబట్టి, ఆ యింటి యజమానురాలైన బ్రాహ్మణి ఉత్తమురాలై వుంటుందని తోచడంబట్టీ అతడు 'దేహి' అంటూ అన్నం యాచించాడు. ఆ యింటి యజమానురాలు ఇంటి లోపలనుంచే "నాయనా! ఇది వేళ కాదు. ఇంట్లో విశేషం వుంది. రెండు గడియలు పోయాక తిరిగి రా" అని జబాబు చెప్పింది. పుండరీకుడు "తల్లీ! మళ్ళీ రావడ మేమిటి? ఆ పెట్టేదేదో యిప్పుడే పెట్టు. అవతల నా భార్యా, పిల్లవాడు తిండిలేక చావడానికి సిద్ధంగా వున్నారు. నీకు పుణ్యం ఉంటుంది. ఇంత అన్నం పెడితే వాళ్లను బతికించిన మహా పుణ్యం లభిస్తుంది." అని మళ్ళీ గట్టిగా అరుస్తూ ప్రాధేయపడ్డాడు.

ఆ కంఠస్వరం చాలా పరిచితంగా వున్నట్లు తోచుటవల్ల ఆ యిల్లాలు తోముతూ వున్న రాగిపాత్ర పట్టుకునే తొందరగా వచ్చి, చూడగా—తన భర్త అయిన పుండరీకుడే అలా ప్రాధేయపడి అడుగుతున్నాడని తెలుసుకుని—తన్ను ఆటలాడించడానికి అలా అంటున్నాడని భావించి నవ్వుతూ "సరే, యీ తమాషాల కేమి లెండి? ఇప్పుడు స్నానానికి వెళ్లి, ఇంతలోనే తిరిగివచ్చేశారే! ఒకవేళ స్నానం కాకపోతే పెరట్లో నూతిదగ్గర స్నానం చేసి, సిద్ధంగా ఉండండి. ఇంతలో భోక్తలు వస్తారు." అని ఆ గృహిణి అన్నది.

ఇలా పలుకుతున్నది పుండరీకుని భార్యఅయిన సావిత్రియే కాని మరొకతె కాదు. అతడు బిచ్చానికి వచ్చినది తన యింటికే కాని మరొక యింటికి కాదు. అతడు ఎంతో వికారంగా ఉండి, చేతిలో బిక్షంకోసం చిన్న కుండ పట్టుకొని వున్నా—ఆమెకు మాత్రం వికారరూపం కానరాలేదు. చేతిలో చెంబు ఉన్న ఎప్పటి పుండరీకుడే కానవచ్చాడు.

పుండరీకుణ్ణి ఇంకా విష్ణుమాయ విడువలేదు. అతడు "అమ్మా! మీ మాటలు నాకు అర్థం కాలేదు, నే నేదో పవిత్రబ్రాహ్మణుడనని మీరు భావించి గౌరవంతో ఇలా అంటున్నట్లున్నారు. నే నొకప్పుడు ఉత్తమవంశంలో పుట్టిన బ్రాహ్మణుడనే! ఇప్పుడో—పతితుడను. చాలా ఏండ్ల క్రిందటనే ఒక బోయకన్యను పెళ్లిచేసుకుని, సంతానవంతుడనైనాను. కరువు సంభవించడంవల్ల మా దేశం విడిచి, కొన్ని నెలలు ప్రయాణం చేసి యీ రోజే ఇక్కడికి వచ్చాము. నా భార్యా, కుమారుడూ ఒక చెట్టునీడ ఆకలికి అల్లాడిపోతూ చావడానికి సిద్ధంగా వున్నారు. పట్టెడన్నం పెట్టి వాళ్ల ప్రాణాలు నిలుపు తల్లీ!" అని మళ్ళీ ప్రాధేయపడ్డాడు.

అతని భార్య సావిత్రికి ఇది ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించినది. తన భర్తను ఏదో భూతం ఆవేశించినదని ఆమె చాలా దిగులుపడినది. ఆమెకు ఏమి చెయ్యడానికీ తోచినది కాదు. కొంచెం సేపు ఆలోచించి ఆమె "ఓ పరాత్పరా! ఆపద్బంధూ! ఈయన వాస్తవంగా నా భర్తయే అయినట్లాయినా, నేను పతివ్రతను అయినట్టాయినా—ఈయనకు ఈ భూతావేశం పోయి యథార్థస్థితి రావాలని కోరుతున్నాను. ఓ దేవదేవా! నీవు ఈ నా కోరికను ప్రసాదిస్తావని విశ్వసిస్తున్నాను." అని ప్రార్థించినది.

భగవంతుడికి ఆమెమీద అనుగ్రహం కలిగినది. తాను ఇంతవరకూ పుండరీకుణ్ణి పెట్టిన చిక్కులు చాలుననీ, యీ ప్రపంచమంతా విష్ణుమాయయే కాని, మరొకటి కాదని తెలుసుకోడానికి యిది చాలుననీ నిశ్చయించి వెంటనే ఆ మాయను తొలగించాడు. పుండరీకుడికి అప్పుడు నిద్రనుంచి మెలుకువ వచ్చినట్లు స్మృతి కలిగింది. ఇంతవరకూ జరిగినది స్వప్నవృత్తాంతంవలె అతనికి తోచింది. అతడు చేతులు జోడించి, భగవంతుడికి మొకరించి నమస్కారం చేసి "నా అజ్ఞానాన్ని మన్నించి, తప్పులు క్షమించు ప్రభూ! నా భ్రాంతి నేటితో తొలిగిపోయింది. "సర్వం విష్ణుమయం జగత్' అనిన్నీ, బ్రహ్మాది దేవతలు నీ దాసులనీ గ్రహించాను. నన్ను కరుణించు ప్రభూ!" అని ప్రార్థించెను. భగవంతుడి మాయవల్ల యమున గోదావరిగానూ, తన గృహం వున్న మధురాపురి ఒక అగ్రహారంగానూ ఇదివరకు అతనికి తోచింది!

భగవంతుడు అతనికి ప్రత్యక్షమై కరుణించి ఆ బోయపడుచూ, ఆ బాలుడూ తదితరాలూ తన మాయకల్పితాలే అనీ, బ్రాహ్మణుడు ఊరిలోకి రాగానే—వారు మాయమైపోయారనీ తెలిపి, "ఇకమీద ఎలాటి భ్రాంతీ పెట్టుకోక—మహర్షుల ఉపదేశాలను విశ్వసించి, వారు చెప్పినట్లు నడుచుకొంటూ ఉండవలె" నని చెప్పి అంతర్ధానమయ్యాడు.

---

# కళ్యాణప్రాప్తికి గొన్ని సాధనములు

తటవర్తి సూర్యనారాయణ

అన్ని పనులయందును స్వార్థత్యాగ మత్యంతప్రధానము. స్వార్థమువీడినచో ఎంతటి నీచ ప్రాణియును గళ్యాణము లందగలదు.

శరీర నిర్వాహమున కావశ్యకమగు భోగములే అనాసక్త భావముతో స్వీకరించవలెను. అనగా - అనక్తి లేకుండుట యున్నను కళ్యాణప్రదము. ఎట్టిపని చేయుచున్నను అహంకారమును బూర్తిగవిడిచిపెట్టవలెను. ఎటువంటి యుత్తమ కార్యమందును అహంకారమును జేరనీయరాదు.

ఇంటిలో పరమేశ్వరుని మూర్తియుంచి భక్తిభావముతో పూజ, అరతి, స్తుతి - ప్రార్థన చేయవలెను. ఇదియును కళ్యాణమార్గమె.

ప్రతిదినము నియమపూర్వకముగ నేకాంతమున గూర్చుండి మనస్సుతో సంపూర్ణవిశ్వమును మరచి పోవలెను. ఇట్టి జగత్తును మరచినచో కేవలమొక్క చైతన్యమగు ఆత్మయే శేషించియుండును. అప్పుడా చైతన్యస్వరూపమును ధ్యానించవలెను. ధ్యానముచేయుట వలన సమాధి కలుగును, ముక్తికలుగును.

ఇతరుల కుపకరించు కార్యములను మాత్రమే శరీర ముతో నిష్కామభావము గలిగి చేయవలెనను నియమ మేర్పరుచుకొనవలెను. దీనికి జాలిన ధర్మమొండు లేనే లేదు. శ్రీరామచంద్రుడుగూడ

'పరహితంబుకంటె బరమధర్మములేదు
అన్యహింసకన్న హానిలేదు'

అని నుడివియున్నాడు. ఈ నియమధారికి భవవిముక్తి లభించును. ఇంద్రియములు, మనస్సు వశమందుం డెనా భగవద్ధ్యానమే సర్వోత్తమకళ్యాణసాధనము. వశ మందు లేకుండెనా అట్టి వేళలయందు ఎట్టి కోరికయు లేకుండగ కేవలమాత్మ కళ్యాణార్థమై వ్రతోపవాసాది సాధ నలు చేయవలెను. పరమాత్ముని ప్రాప్తిదక్క నన్య మేమియు నతని గోరరాదు. ఇట్టి సాధనమువలన పర మేశ్వర ప్రాప్తియగును. సారాంశమేమన - మనస్సు, ఇంద్రియములు వశములో నుండియున్నప్పుడు ధ్యాన యోగ సాధనము వశములో లేనిపక్షమున నిష్కామతతో కేవలము భగవత్ప్రాప్తికై తపస్సు ఉపవాసాదుల సాధ నము చేయవలెను. కాని యిన్నింటి కంటెనుగూడ భజన మనునదే సులభోపాయము.

లేచుచు, గూర్చుండుచు నడచుచు ప్రతివేళల నామమే జపించుచుండవలెను. నామము నెన్నడును మఱవరాదు. ఇది భగవత్ప్రాప్తి కత్యంత సులభోపాయము.

ఇంకొక సాధనముగూడ గలదు. అది ఆనందమయా ధ్యానము. దీనివలన నెల్లవేళల ఆనందమే కలుగుచుం డును. పరిశ్రమకూడ చేయనక్కరలేదు. "ఆనంద మయోఽభ్యాసాత్" (బ్ర-సూ 1-1-12) ఆనందము పర మాత్ముని స్వరూపము. నాలుగువైపులను బయట లోపలను ఆనంద మొక్కటే పరిపూర్ణమయి యున్నది. యావత్ప్ర పంచమునందానందమే వ్యాప్తమైయున్నది. ఒకవేళ ఇట్లుగా గన్పించకున్నను వాక్కుతో పలుకుచు మనస్సుతో తలచుచుండుము. నీటిలో మునిగిపోయినట్లు మునుకలు వేయుచున్నట్లుగ నిరంతరమానందముననే మునిగి యుండవలెను. మునుకలు వేయుచుండవలెను. రాత్రి బవలునానందమగ్నులై యుండవలెను. అప్పుడు మరణించి నను గృహమగ్నిచే దహించబడుచుండినను ఇంకేదైన పెద్ద కీడు సంప్రాప్తించినను ఆనందమే, ఏమైన గానిమ్ము- కేవలమానందమేయని భావించుము. ఇట్టి విధమున నభ్యసించగా నభ్యసించగా సంపూర్ణ దుఃఖములు క్లేశ ములు పటాపంచలగును. వాక్కుతో పలికెడివా ఆనంద మునే; మనస్సుతో మననముచేయుదువా ఆనందమునే, బుద్ధితో ఆలోచించెదవా ఆనందమునే; కాని ఇట్లు నిర్మగ్నత కలుగకున్నను కల్పితరూపములో నానందానుభవమే చేయవలెను. దీనిఫలితముకూడ బహుశ్రేష్ఠమైనదగును. ఇట్లు చేయుంజేయ కొన్నాళ్లకు నిత్యానంద ప్రాప్తికలుగును. ఈ సాధనమెల్లరును జేయగలుగుదురు. పూర్వకాలములో మహమ్మదీయుల పరిపాలనలో హిందువులను, 'హిందు వులారా! మీరు మహమ్మదీయులు కానక్కరలేదు. హిందు వులుగనే యుండుడు. హిందూ మతావలంబకులుగనే యుండుడు. కేవలము మీపేరు మాత్రము మహమ్మదీయు లలో వ్రాయించుకొనుడు. ఎవరైన అడిగినచో మేము మహమ్మదీయులమనిచెప్పుడు. ఇందు మీకేమి నష్టమున్నది?' అని యడిగిరి. హిందువు లంగీకరించిరి. ముందుముందు వారి సంతానముతో కాజీలు 'మీరు మహమ్మదీయులు గనుక ఇస్లామమతమును స్వీకరింపుడు' అని చెప్పిరి. చివరకిట్టివారే నిక్కమగు మహమ్మదీయులైపోయిరి. ఈ విధముగనే మనమందరమును ఒక్క ఆనందమేయని స్థిరపరచుకొనవలెను. ఇట్టి నిశ్చయము చేసుకొంటిమా- ఎటుజూచినను ఒక్క ఆనందమే అగును.

భగవంతుని మూర్తి (విగ్రహము) లేదా - చిత్రపటము నెదుటనుంచుకొని నేత్రములు విప్పి అతని నేత్రములతో మననేత్రములను గలుపవలెను. కన్నులు దెరచి అందు

ధ్యానించవలెను. ఇందుండి భగవంతుడు ప్రత్యక్షమగునని ధ్యానమువేళ విశ్వాసముంచవలెను. విశ్వాసముతో గూడిన ధ్యానమువలన భగవంతుడు లభించును. ఇదికూడ సులభోపాయము. ఈ జగత్తులోని వృక్షములు శిలలు మనుష్యులు పశువులు పక్షులు మున్నగు గన్పించు ప్రతి వస్తువును జూచుచు భగవంతుడే యీ రూపములను ధరించియుండియున్నవాడని భావించవలెను. మనస్సుతో-నీ యిచ్చు చొప్పనబొమ్మ్మ. సమస్తరూపధారి భగవంతుడు సుమా! అని చెప్పుము. కన్పించు వస్తువులన్నియు నారాయణ స్వరూపములే. సమస్త ప్రపంచములోని సర్వులను భగవత్స్వరూపములే యని యెరింగి భగవద్బుద్ధితో మనసా యెల్లరకు నమస్కరింనవలెను. ఒక్క పరమాత్ముడే అనంత రూపములు ధరించెనని తలంచుచు నిట్టి యభ్యాసము చేయుటవలనను కళ్యాణకారియే కాగలదు. ఈ విధముగ శాస్త్రములయందనేకోపాయములు చెప్పబడియున్నవి. ఎవరికేది తేలికగ తోచునో వారది సాధించబూనవలెను. అందు జెప్పబడిన వానిలో నెద్దానిని సాధనము గావించినను గళ్యాణమొనగును.

వృత్తులు రెండు—అనుకూలము ప్రతికూలముననిని. మనస్సునకు బాగని తోచునవి అనుకూలములు, విరుద్ధముగ దోచునవి ప్రతికూలములు. ఏ పనియైనను మనస్సునకనుకూలముగనున్నచో అట్టి పనిలో సహజముగ నంతోషమును, మనస్సునకు బ్రతికూలముగ దోచినదానిలో దుఃఖమును గలుగుచుండును. ఆ దుఃఖమును భగవద్దత్తమగు పురస్కారమని యెంచి అందుపైని గల ప్రతికూలత్వమును వేరుచేయవలెను. జరుగునదంతయు భగవంతుని కోరిక చొప్పననే యని భావించవలెను. భగవంతుని ఆజ్ఞ లేనిదే చెట్టునుండి యొక ఆకైన గదల గలదా?

మనమనుకూలమందు నంతోషించి ప్రతికూలమునందు దుఃఖించెదము. అహా! ఈ విధముగ పరమేశ్వరుడు ప్రాప్తించ గలడా? భగవంతుని నంతోషము మన నంతోషముగా నిశ్చయించుకొనవలెను. మనోనుకూలమగు కార్యములలో ఇట్లే నిశ్చయించుకొనుటలో మనకేబాధయును లేదు; గాని మనస్సునకు బ్రతికూలములగువానిని అనుకూలముగా జేసుకొనవలెను. అది భగవంతునికి మాత్రము ప్రతికూలము గాదని బాగుగ జ్ఞప్తియందుంచుకొనవలెను. భగవంతునికే ప్రతికూలమగుచో అది జరుగుటయే యెట్లు? ఈ సాధనమువల్లను మనకు క్షేమము గలదు.

మాట సత్యము భాషించవలెను-వ్యవహారము సత్యముగా జేయవలెను. ఆచరణము సత్యముగా నుండవలెను. ఇందును గళ్యాణమే గలదు.

యావత్ప్రపంచములోని పదార్థము లే రూపములో గన్పడుచున్నవో అవియన్నియు నిజముగ నశ్వరములే. అవి యథార్థరూపములో మనయెదట నున్నవి. ఆ పదార్థము లన్నింటను నమబుద్ధియుంచవలెను; భేదభావము దొలిగించవలెను. ఏ వస్తువునందును భేదముంచరాదు. శరీరములో 'స్వ' ఉన్న భేదములేదు. అవయవములలో భేదములేదు. ఇట్లే పరస్పర భేదబుద్ధి యుండరాదు. సర్వ నమానత్వముంచి భేదబుద్ధి విడనాడవలయును. భేదబుద్ధి లేకుండుటచేతను గళ్యాణము కలుగును.

నీటి ప్రవాహము గాలి పశుపక్షులు మున్నగువాటి ఏ శబ్దము వినవచ్చినను, శబ్దమే భగవంతుడని భావించవలెను. ఎట్టి శబ్దము వినిపించిననునరే "నాదంబ్రహ్మ" శబ్దమునే బ్రహ్మమని యెంచవలెను. ఏమివినిపించిననునరే- అదే భగవంతుడు. దూషించినను ఆశీర్వదించినను రెండింటిని భగవంతునిగనే భావించుము. దూషణ వినినంతనే మనకు కష్టముగలిగినచో ఇక శబ్దమును భగవంతునిగ నెక్కడ భావించినట్లు? భగవంతుడని యెంచితిమా అనందమే యానందము గలుగును. భగవద్దర్శనము గలుగు నానందమే దూషణ వినినంతను గలుగునట్లు అనుభవించవలెను. ఇదికూడ కళ్యాణసాధనము.

నంకల్పమాత్రమును (స్ఫురణ) భగవత్ స్వరూపమని యెంచి ఏకాంతములో కన్నులు మూసుకొని కూర్చుండవలెను. మనస్సు చూచునది మనస్సు వెళ్లునదంతయు భగవంతుడేయని భావించవలెను. నామనస్సు భగవంతునిదక్క నన్యవస్తువెద్దానిని జింతించనే చింతించదని నిశ్చయించుకొనవలెను. మనస్సు ఘట-పటాదులలో దేనిని జింతించిననదేభగవంతుడని యెంచి అందులోనే భగవద్బుద్ధి యుంచవలెను. మనస్సు చింతించునది భగవంతుడే అని విశ్వసించవలెను. మనస్సు చింతించుచున్నదే భగవంతుని స్వరూపము. మనస్సు భార్య, పుత్ర, ధనాదులను జింతించుచున్నను, వారిని భార్య పుత్ర ధనములని తలచక భగవంతుడేయని యెంచవలెను. శిలనుగాని వృక్షమునుగాని చింతించినను అదియు భగవంతుడే. ఎట్లు కనిపించుచుండునో భగవత్స్వరూపమునట్లే భావించవలెను. ఇదికూడ కళ్యాణప్రాప్తికి రాజబాట. పైనజెప్పబడిన సంగతులన్నింటిలో నొక్కొక్కటి యాచరించినను మేలుగలుగును; కాని శ్రద్ధబట్టి ఇష్టముబట్టి ఒక సాధనములో ఎక్కువకాలము ఒకదానిలో తక్కువ నమయుము పట్టుట మాత్రము తప్పదు, కాని అన్నింటివల్లను కళ్యాణమగుట సిద్ధము.

స్వప్నములో గన్పడిన జగత్తు కనులుదెరచి మేల్కొన్న మీదట గన్పడదు. గనుక, నేను స్వప్నములోనుంటిని నాకు గన్పించునదంతయు స్వప్నమని విశ్వసించవలెను. స్వప్నసమాప్తియందు అసలు సత్యవస్తువు దానికదే సున్న ష్టమగును. కనుపించువస్తువు సత్యమైనదికాదు. స్వప్న

మువంటిదని నమ్మవలెను. తోచునది, కన్పించునది లేనే లేదుగదా. స్వప్నముతప్పక తొలంగిపోవును. కన్నులు తెరువగనే తొలగిపోవును. ఇందుపై నెందుచే నింతవరకు కన్నులు తెరవలేదని అడిగినచో నందుపై - ఇంతవరకు ప్రపంచము స్వప్నమువంటిదనే నిశ్చయ మెప్పుడు చేసితివి? అని ఉత్తరమొసగుదుము. ఆత్మ సంకల్పము సత్యము గనుక యీ ప్రపంచము స్వప్నమని నిశ్చయించుము. సత్యముగా దోచుచున్ననదే-స్వప్నము వంటిదని తలంచుచుండుము; తలంచగా దలంచగా నొక రోజున స్వప్నము నశించి సత్యవస్తువు ప్రాప్తించును.

అందరకు ప్రాణమన్నింటికంటె ప్రియమైనది. ఇంతకన్న ప్రియవస్తు వింకొకటిలేదు. అతిప్రియమైన వస్తువెప్పుడును జ్ఞప్తిలో నుండును; గనుక ప్రాణములయందు బ్రహ్మభావముంచుము. వచ్చిపోవు శ్వాసలపై లక్ష్యముంచుము. శ్వాసలు చివరవరకునుండును. ఇట్లు ధ్యానము చేసినచో అంతసమయమున కుద్ధారముగలుగును. ప్రాణమును బ్రహ్మగాభావించుము. అందలిధ్వని బ్రహ్మనామమని భావించుము. ఏలనన-ప్రాణములనుండి "సోఽహం సోఽహం" శబ్ద ముచ్చరించబడుచునుండును. ఇదియు బరమాత్ముని నామమే. గనుక ప్రాణమే బ్రహ్మయని నిశ్చయించినచో ఇదియును గళ్యాణమార్గమే. ఇప్పుడెవ్వరికి నేది సులభోపాయమని తోచిన వారది అభ్యసించవచ్చును.

ఇట్టి వింకను వేలకొలంది యుపాయములున్నవి. కాని యేదియైనను జేయక తప్పదుగదా. సాధనచేయనిదే మేలులభించదు. ఈ సాధనలన్నియు భగవద్గీత - వేదములందు శృతులందు జెప్పబడియున్నవి. శ్రేయోఽభిలాషులిందలి ఏయొక సాధననైనను తమకిష్టమైనది గ్రహించి అభ్యసించవలెను.

పరమానంద ప్రాప్తికి సాధనావశ్యకత

ప్రపంచమున నందరును సుఖమును గోరుదురు. అందరును బరమానందమే వాంఛింతురు. అహర్నిశలును సుఖప్రాప్తి ప్రయత్నముననే యుందురు. కాని సుఖము సంగతి యట్లుండనిమ్ము-అసలైన సుఖముయొక్క ఛాయయైన లభించదు. ఇందుకు గారణము? ఇంత ప్రయత్నించినను సుఖమేల చేకూరదు?

ఇందుపై గంభీరముగ నాలోచించితిమేని మనకు వాస్తవికసుఖ శాంతి ప్రాప్తికవరోధ శత్రువులు మూడుగలవని తెలియగలము. ఆ అవరోధమువలనే మనము సుఖమును సమీపించనైన జాలము. అవి-మల, విక్షేప, అవరణములు.

మలమన మనోమలినత్వము. విక్షేపమన్న చంచలత్వము. అవరణమనగా అజ్ఞానము యొక్క తెర. ఈ మూడింటిని సమూలనాశము గావించనంతవరకు మనకు యధార్థ సుఖ ప్రాప్తి అసంభవము. ఇందులో అవరణ నాశమన్నది తేలికగనే జరుగగలదు. అవరణమును దొలగించుటకై పెద్ద ప్రయత్నమేదియు జేయనవసరము లేదు. భగవంతుడే స్వయముగ బుద్ధియోగము ప్రసాదించి యావత్తు మోహమును హరించును. భగవంతుడు—

"మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరం
కథయంతశ్చమాంనిత్యం తుష్యంతిచ రమంతిచ ॥
తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగంతం యేనమాముపయాంతి తే ॥
(గీత 10.9.10)

"నాయందే నిరంతరమును మనస్సుంచినవారును నాయందే తమ ప్రాణములనుగూడ సమర్పించు భక్తవర్యులు నాభక్తిని చర్చించుచు బరస్పరమును నాప్రభావమును జెప్పకొనుచు నాగుణము నాప్రభావమును వర్ణించుచు సంతోషించుచుందురు. నాయందే సర్వదా రమించుచుందురా నాధ్యానాసక్తులయి నన్ను ప్రేమతో భజించు ఆ నాభక్తులకు నన్నే చివరకు బొందజాలిన తత్త్వజ్ఞాన రూపమగు యోగమును బ్రసాదింతును." అని చెప్పియున్నాడు.

మనస్సు మలినముగ చంచలముగ నున్నంతవరకు బ్రేమపూర్వకముగ నన్ను భజింపనే లేడు; మరి యట్టివానికి బుద్ధియోగమెట్లు ప్రాప్తించును? పాపమువలన మనస్సులో ననేక విధములైన మలినవిచారములు బుట్టుచుండును; ఏకాంతములో ధ్యానముచేయుటకై కూర్చున్నవేళలో చెడ్డ తలంపులే మనస్సులో జనించుచుండును; ఇదియే మనోమాలిన్యము. రాగ ద్వేష కామ క్రోధ లోభ మోహ కపట అభిమాన ఈర్ష్యాది దుర్గుణములు దుర్భావములును మనోమలినత్వముచేతనే కలుగును. ఏ వ్యక్తియందీగుణము లెక్కుడుగ నెంతయుండునో వాని మనస్సుకూడ అంత మాలిన్యముచే నాచ్చన్నమైయుండును.

మలదోషనివారణకై యనేకోపాయములు జెప్పబడియున్నవి. ఇందులో బ్రధానములు రెండు—భగవన్నామ జపము, నిష్కామకర్మయును. భగవన్నామము పాపనాశన కార్యముగ మంత్రమువలె చేయును. ఇందు పాపనాశనమున కపరిమేయ శక్తి గలదు. కాని నామములో ప్రీతి, శ్రద్ధ, విశ్వాసముండుట అవశ్యకము. దురాశా పూరితుడగు వణిజుని ప్రధానదృష్టి ధ్యేయము ధనసంపాదనమేయై నిరంతరమాధ్యేయమునే మనస్సులో నుంచుకొని సమస్త కార్యములు చేయుచుండునట్లుగా భగవత్ప్రేమను లక్ష్యము జేసుకుని మనము రామనామమను తరుగని నిధులు ప్రోగుచేసుకొనవలయును.




ఇట్లే నిష్కామకర్మయోగమువల్లను మలవినాశము కాగలదు. నిష్కామకర్మయోగములో రెండు ముఖ్యభేదములు గలవు. భక్తి ప్రధానకర్మయోగము. కర్మప్రధాన కర్మయోగము. ఈ రెండింటిలోను భక్తి ప్రధాన కర్మయోగము విశేషముగ శ్రేష్ఠము. వాస్తవమునకు రెండును భగవత్ప్రాప్తికి లక్ష్యములే. స్వార్థభావము లేనిదే కర్మయోగము ఫలించనే ఫలించదు. ఫలాసక్తివిడిచి భగవత్ప్రాప్తికై శాస్త్రోక్త కర్మలాచరించుటయే నిష్కామకర్మయోగము. ఇట్టి నిష్కామకర్మయోగమువలన మన మనోమాలిన్య రూపమగు దుర్గుణములు, దురాచారములు నశించి సద్గుణములు సదాచారము శాంతి, సుఖము సంప్రాప్తించును. సాత్త్విక భావములు సద్గుణములు జనించును. ఈ విధముగ మలదోష నివారణానంతరమున విక్షేపము దానంతట యదేతొలంగి పోవును. చిత్తము పరమ నిర్మలమై శాంతమై భగవద్భక్తిలో తత్పర మగును. పిదప భగవంతుని దయచేత ఆవరణముగూడ తొలగిపోవును. ఆవరణము దొలంగెనా పరమానంద ప్రాప్తి. మానవ జీవన సఫలత్వమును, మోక్షమునుగాని భగవత్సాక్షాత్కారమును గాని బడయనెంచువారికి నిష్కామ భావముతోడి భగవద్భక్తికంటె మించిన సాధన మన్యమెద్దియునులేదు. భగవంతునిపై మనకనన్య ప్రేమయుండవలెను. ఇందుకే తత్పరత్వమున ప్రయత్నించవలెనను లక్ష్యము మనకుండవలెను. సఫలత్వముగాంక్షించు నెల్లవారును తమకొక లక్ష్యమేర్పరచుకొని నడచెదరు. ఎల్లరు తమజీవితమున కొకలక్ష్యముంచుకొని తమ బుద్ధినిబట్టి ఆ ధ్యేయమునే పరమోత్తమమని శ్రేష్ఠమని తలంతురు. ధ్యేయములో సర్వోత్తమబుద్ధి లేకున్నచో ఆవైపున కేగుట కఠినమేగాక అసంభవమును. మనలక్ష్యము జగత్తులో అన్నిటికంటె మించినదై యుండవలెను. అట్టి లక్ష్యమునుండి విచలితమొనర్చు రాగద్వేషాదులవలన బుట్టునది మోహము. మోహవశులమై మనము మన లక్ష్యమును జూడజాలము.

ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వమోహేన భారత
సర్వభూతాని సంమోహం సర్గే యాంతి పరంతప,
(గీత 7-27)

"ఓ అర్జునా! ప్రపంచములో ఇచ్ఛాద్వేషమువలన బుట్టి సుఖ దుఃఖాది ద్వంద్వరూపమైన మోహము చేతనే సమస్త ప్రాణులు సత్యంతము నజ్ఞానతా విమూఢులగుచున్నారు." ఇది సమస్త ప్రాణులదశ.

ఎంతోకాలమునుండి సాధన చేయుచున్నను భగవత్ప్రాప్తికాలేదని చాలమంది సోదరు లెంచవచ్చును. దీని కేకైకకారణము, వారిబుద్ధి మనస్సు, పవిత్రముగ, స్థిరముగా లేకపోవుటయే యనవచ్చును. సాధనసఫలత్వము మనోబుద్ధుల పవిత్రత్వ స్థిరత్వ[illegible]పైనే [illegible]యున్నది. ఈరెండును పవిత్రమై[illegible]కున్నచో సాధన ఫలము సిద్ధించుట ఇంకెట్లు? నిష్[illegible] వల్లనే మనోబుద్ధులయందు నిర్మలత్వ స్థైర్య[illegible]గును. మనస్సు ఇంద్రియములు శుద్ధమై - స్థిరమై భగవంతునిలో ప్రవేశించుటకు మొట్టమొదట వానిని స్వవశీభూతములుగా చేసుకొనుట అత్యంతావసరము. ఇవి స్వాధీనము గానంతవరకు భగవంతుని స్వరూపములో స్థిరమై యుండవు. భగవత్సాక్షాత్కారమునుగా జాలదు. పతంజలిమహర్షి మనస్సును వశమందుంచుకొనుటకు - అభ్యాసము వైరాగ్యమని యుపాయము చెప్పినాడు. ఇందువలన చిత్తము వశమగును. వృత్తులేకాగ్రమగును. చిత్తనిరోధము కాజాలును. ఈ భావమే గీతలోగూడ సుస్పష్టము చేయబడినది.

అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చగృహ్యతే
(6. 35)

"అభ్యాసము వైరాగ్యములవల్లనే మనము వశమందుండును" సంయతచిత్తుడే ప్రయత్నించిన భగవత్ప్రాప్తి వడయుగలడు. వ్యభిచారిణివృత్తులవలన భగవంతుని బట్టుకొనుట కష్టమేగాక అసంభవముగూడ.

చిత్తములో విషయాసక్తియున్నంత కాలము ఆచిత్తము వశమందుండుట కష్టము. విషయాసక్తి బోగొట్టుట కుపాయము వైరాగ్యము. ప్రాపంచిక విషయములన్నియును దుఃఖస్వరూపములే యని వితర్కించుకొనుచుండవలెను. ప్రాపంచిక భోగములు దుఃఖమూలకములనియు క్షణికములనియుసని చెప్పి విద్వాంసులిందులో లిప్తులు గారని భగవంతుడు వక్కాణించియుండెను.

యే హి సంస్పర్శజాభోగా దుఃఖయోనయ ఏవతే
అద్యంతవంతః కౌంతేయ నతేషు రమతే బుధః॥
(గీత 5.22)

"ఈ యింద్రియములవలన విషయసంయోగమువలన జనించు భోగములన్నియు విషయా సక్తులగు వారికి సుఖముగా దోచును; అయినను నివియెల్ల దుఃఖ కారణములు. అద్యంతములుగలవి. అనగా-అనిత్యములు గనుక అర్జునా! బుద్ధిమంతులు జ్ఞానులిందు సంసక్తులుగారు."

కనుక బుద్ధిమంతు లాలోచించవలసిన దేమనగా - ఇట్టి విషయ భోగాసక్తులు మూర్ఖులనిన మనముగూడ అసక్తులమై యేల మూర్ఖులముగావలె? విషయా సక్తులు మూర్ఖులెట్లయిరి ? వారి సమయము, ధనము వ్యర్థముగా వ్యయమై పోవుచున్నది. జీవితము పాపమయమై పోవుచున్నది. పాడు కారణముచే వారెన్నియో దుఃఖముల పాల్పడుచున్నారు.

తనకుదానే దుఃఖమునకు గారణుడైనవాడే మూర్ఖుడు. కనుక విషయములనుండి చిత్తవృత్తులను సర్వదా తొలగించుచు నుండవలెను. ప్రపంచములోగల భోగములన్నింటియందును దుఃఖములను దోషములను జూచుచుండవలెను. విషయములు మోహము అసక్తి కారణముచే అమృతతుల్యములై సుఖప్రదములట్లు దోచుచున్నను పరిణామములో విషమువలె ఘాతకము. ప్రాణమును హరించునవి. ఉభయలోకములను బాధుచేయునవి. విషయభోక్త యీ జగత్తులో పదేపదే పుట్టుచు జచ్చుచు నానా ప్రకార దుఃఖములలోబడి పీడితుడగుచున్నాడు. విషయభోగము విషభక్షణమున కంటెను హానికారకము. ఆలోచించి వితర్కించి విషయములలో కేవలము దుఃఖమే యున్నదని చూచువాడు- గుర్తించువాడే బుద్ధిమంతుడు. సమస్త విషయము లత్యంతాపవిత్రములనియు ఘృణితములన్నియునంచే రమించుచుండుట పాపమనియు దోషదర్శనమునకు తాత్పర్యము. పోనీ - యీ భోగములు సుస్థిరములైనచో నిత్యము సుఖప్రదములని యెంచవచ్చును. కాని యివి క్షణభంగురములు. ప్రతినిమునమున పరివర్తన శీలములుగదా. ఇదియునుగాక ఇందు సుఖముకూడ లేశ మాత్రమునులేదు. అదైన క్షణికము. అదియు భ్రమవల్లనే సుఖప్రతీతి. క్షణకాలసుఖముగూర్చి మహాదుఃఖ సముద్రమున ముంచివేయుచున్నవి. వాస్తవమునకవి సుఖస్వరూపములే అయియున్నచో నిరంతరము సుఖరూపములై యుండియుండునుగదా. గనుక విషయములనిత్యములస్థిరము లసుఖములు విషరూపములు నరకపాత మొనర్చునవియును. విషయములయెడ మనకుగల ఆసక్తియు వైరాగ్యమున మనకుగల విరక్తిచేతనే అంతయు దారుమారైనది. అందుచేతనె మనకు విషయములు సుఖముగ గన్పట్టి వైరాగ్యము చెడ్డగ దోచుచున్నది.

వాస్తవములో విషయములనిత్యములగుటబట్టి సర్వథా అసత్తులు. విషయముల ఈ అనిత్యత్వము వాటి అసత్త్వము చూచుచుండియు అనుభవమున నెరింగి యుండియుగూడ మనము తదుపభోగమునకే ప్రవృత్తులమగుచుందుమిది మన తెలివితక్కువ తనముగాదా? ఇట్టి మూర్ఖత్వమును సదాలోచనతో బోగొట్టుకొనవలెను. ఆలోచనవలన వివేకము జనించును; వివేకమువలన వైరాగ్య ముత్పన్నమగును. ఈ దృఢ వైరాగ్య శస్త్రముతో విషయరూపమగు సంసార వృక్షమును దెగనరుకుట చెతకుగడ నరుకునంతటి తేలిక పనిగా గాజాలును. విషయముల దెనకు వృత్తులను నెన్నడును బోనివ్వకుండుట వాటినుండి మిక్కిలి ఉపరమత్వము గాంచుట తచ్చింతనము మానుకొనుట యనుసదే వాటిని ఛేదించుట యన్నది. సర్వవిధానర్థముల యుత్పత్తియు వీటిని జింతించుటవలననే యగుచున్నది. భగవంతుడు గూడ—

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥
క్రోధాద్భవతి సంమోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాద్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి॥
(గీత 2-62.63)

విషయచింతనునికి వాటియందాసక్తి గలుగును; ఆసక్తి వలన కామన; తద్విఘ్నమున గ్రోధము; దీనివలన మిక్కిలి మూఢభావమువలన స్మృతిభ్రమము జనించును; స్మృతి భ్రమవలన బుద్ధి - అనగా జ్ఞానశక్తి నశించును. బుద్ధి నాశనమువలన నిజస్థితి పతనము ప్రాప్తించును.

సత్తా అసత్తులనుగొని విషయచింతన మొనర్చుటయే పతనకారణము. నశ్వరములని - క్షణభంగురములని అనిత్యములని యెరింగి వీటిని దుఃఖకారణముగా భావించితిమా ఇవి మనలను స్పృశించనైనజాలవు.

గీతలో :—ఎవనికి సర్వకర్మములయందును సర్వపదార్థములయందును అసక్తి లేకుండునో వాడే సర్వసంకల్ప సన్యాసి యని చెప్పబడును.

" యదాహినేంద్రియార్థేషు నకర్మస్వనుషజ్యతే
సర్వసంకల్పసన్యాసీ యోగారూఢస్తదోచ్యతే "
(గీత 6-4)

పదార్థములయందును గర్మలయందును ఆసక్తమనస్కుడు గాని వాడే యోగి యనబడును. పని చేయుచుండును గాని అసక్తుడు గాడు. స్ఫురణముండును గాని అసక్తి యుండదు. ఇట్లు సర్వసంకల్పములను త్యజించిన వాడే యోగారూఢుడు. ఇందువలన తేలినదేమనగా-పదార్థములను నశ్వరములని క్షణభంగురములని యెరింగిన మీదట తత్స్మరణ స్ఫురణా మాత్రమే కనుక నిది అనర్థకారి కాదు. సత్తా కలిగియుండుటచేతనే ఆసక్తి కలుగును. అసత్ అనగా అభావములో ఆసక్తి యుండనే యుండదు గదా. కాని అందుచేత యీ చరాచర జీవులుగూడ అసత్తులే యని యెంచరాదు. అవి అసత్తులుగావు. కార్యరూపమగు మన యీ శరీరమసత్తు, క్షణభంగురము, నశ్వరము, ఆద్యంతములు గలది. అసత్తునకునికియే లేదు, సత్తు కెన్నడును అభావము లేనేలేదుగదా.

నాసతో విద్యతేభావో నాభావో విద్యతేసతః
(గీ 2-16)

మరియు.

అంతవంత ఇమేదేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వభారత॥
(గీత 2-18

దేహము నశ్వరము. కాని దేహి (ఆత్మ) అవినాశి. దేహమసత్తు. దేహి సత్తు. దేహముయొక్క అన్ని వస్తువులు అనిత్యములు క్షణభంగురములును. ప్రపంచమున మనము చూచుచున్న సత్తా స్ఫూర్తియంతయును ఆ పరమాత్మునిదే. ఆ పరమాత్మ నిత్యుడు, శాశ్వతుడు, సనాతనుడు, అవ్యయుడు. అతనియొక్కని వలననే సర్వసత్తా స్ఫూర్తియగుచున్నది. చేతనా స్ఫురణములు యావత్తును వానివే. అతడే నిత్యసత్య స్వరూపుడు. ప్రపంచముయొక్క సత్తా మూలమున అతనియునికి. ఈ ప్రకాశించు చేతసత్వము పరమాత్ముని స్ఫూర్తియే. ఇవంతయు పరమాత్ముని స్వరూపము. సమస్తము వినాశనమై పోయినను తద్వినాశము గాదు. అతడు సర్వదా సర్వత్ర ప్రత్యక్ష విద్యమానుడు. ఇట్టి ఆ పరమాత్ముని శరణుజొచ్చి ఆనందసుధాసాగరమున మునకలు వేయుచుండవలెను. ఇందుకై కొన్ని యుపాయములు భగవంతుడే చెప్పియున్నాడు.

"ధ్యానేనాత్మనిపశ్యంతి కేచిదాత్మాన మాత్మనా
అన్యేసాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే
అన్యేత్వేవమజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే
తేఽపిచాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః"
(గీత 13-20-25)

"కొందరా పరమాత్ముని పరిశుద్ధమగు సూక్ష్మబుద్ధితో ధ్యానముద్వారా హృదయములో గాంచుచుందురు. కొందరు జ్ఞానయోగముద్వారా, కొందరు కర్మయోగముద్వారా చూచుచుందురు-అనగా బొందుచుందురు. కాని ఇతరులు-అనగా మందబుద్ధులు స్వయముగ నిట్లెరుంగ జాలనివారై తత్త్వవిదులగు నితరులవలన వినియే తదనుసారముగా ఉపాసింతురు. అట్టి శ్రవణపరాయణులగు వారుగూడ మృత్యురూపమగు సంసారసముద్రమునుండి నిస్సందేహముగా తరించిపోవుదురు."

మహాత్ములగువారు జెప్పనుపాయమేది ? వారేదో యొకదాని అంగమాత్రము దెలిపినను తత్సాధనవలనను సాధకునికి గళ్యాణమే.

ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుడు సత్యకామునితో గోసేవ బ్రహ్మజ్ఞానము చేకూర్చునని నుడివెను. అట్లే ఒక్క గోసేవ చేసినంతమాత్రముననే సత్యకాముడు కృతార్థుడయ్యెను; వానికి భగవంతుడు ప్రాప్తించెను. మహాత్ముల కథనానుసారము గోసేవయే పరమ ముఖ్య సాధనమయ్యెను; పతంజలి మహర్షి నుడివియున్న అష్టాంగయోగములోని ఒక అంగము లేక యొక ఉపాంగమాత్రముననే బ్రహ్మప్రాప్తికాజాలును. కేవల ధ్యానముచేతను ప్రాణాయామముచేతనుగూడ భగవంతుని బడయవచ్చును. నియమాంగ స్వాధ్యాయము ఈశ్వరప్రణిధానము చేతను గూడ పరమాత్మప్రాప్తి నిశ్చయము.

ఈశ్వరప్రణిధానాద్వా॥ (యోగ-1-23)

దీనివల్ల స్పష్టమైన దేమనగా - ఒకయంగము చేతగాని యొక ఉపాంగముచేతగాని భగవత్ప్రాప్తి కాగలదు. హృదయమును పవిత్రముగను మనోబుద్ధులను స్థిరముగను జేసుకొనుటకు శాస్త్రోక్త విభిన్నమార్గములలో నేదో యొకటి నిశ్చితము చేసుకొని ప్రాణపణముగ ప్రయత్నించవలెను. భగవత్కృపవలన విజయము నిశ్చితము. సఫలత్వము ప్రాప్తించితీరును.

పండ్రెండవ అధ్యాయములో భగవానుడు 'మత్పరాయణులగు భక్తులు సంపూర్ణ కర్మలు నాయందర్పణముజేసి సగుణస్వరూపుడనైన నన్నే తైలధారవలె అనన్యధ్యాన యోగముతో నిరంతరము చింతించుచు భజించెదరు. ఆ మదర్పిత చిత్తులగు ప్రేమిభక్తులను నేను శీఘ్రములో మృత్యురూపమగు సంసారసాగరమునుండి యుద్ధరించెదను.' ఇటుపైన భగవంతుడు అర్జునునితో - 'నీవు నాయందు మనసునుంచుము, బుద్ధియుంచుము. ఇట్లైనచో నీవెప్పుడును నాయందే వసించెదవు - అనగా నన్నే పొందెదవు. ఇందు సందియము సుంతయునులేదు. కాని నీవు మనస్సును నిశ్చలరూపముగ నాయందు హత్తజాలక పోయితివా-అభ్యాసమువలన నన్ను బడయుటకై యూహించుము. ఒకవేళ ఇట్లభ్యాసము చేయుటకు నసమర్థులైనచో కేవలము నాకొఱకే కర్మలచేయుటలో పరాయణుడవు గమ్ము. ఇట్లు నా అర్థకర్మములు గావించుచు నన్నే పొందగలవు. ఇదియు జేయజాలనందువా సర్వకర్మల ఫలితమును త్యజించుము. ఇట్టి త్యాగమువలన తత్కాలమే పరమశాంతి ప్రాప్తించును.' అని వచించినాడు.

పై వివరణములో భగవానుడు సాధనయొక్క విభిన్నమార్గములు జక్కగ దేటతెల్లము గావించెను. ఎవని కేది ఇష్టమో ఎవని కెట్టి సామర్థ్య ముండియుండునో, అతడట్లే చేయవచ్చును. ఇట్లే నాల్గవ అధ్యాయమందుగూడ యజ్ఞనామముతో సాధనయొక్క యుక్తులు మార్గములు గొన్ని చెప్పబడినవి.

"బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం
బ్రహ్మైవతేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥
దైవమేవాపరేయజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నావపరేయజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి
శ్రోత్రాదీ నింద్రియాణ్యన్యే సంయమాగ్నిషుజుహ్వతి
సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే
ఆత్మసంయమ యోగాగ్నౌ యోగయజ్ఞాస్తథాపరే
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః

అపానే జుహ్వతిప్రాణం ప్రాణేపానం తథాపరే
ప్రాణాపాన గతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః
అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వేప్యేతేయజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః ॥

(గీ. 4-24-30)

"యజ్ఞమందర్పణము చేయబడునదియు బ్రహ్మయే. హవనముచేయబడు ద్రవ్యముగూడ బ్రహ్మయే. బ్రహ్మరూపు డగు కర్తద్వారా బ్రహ్మరూపాగ్నియం దాహుతి యొనగుట యను క్రియయు బ్రహ్మమే. అట్టి బ్రహ్మకర్మమందు తత్ప రునికి ప్రాప్తయోగ్య ఫలితము బ్రహ్మమే. కొందరుయోగులు దేవతాపూజనమని యజ్ఞమునే లెస్సగ అనుష్ఠించు చుందురు. కొందరు పరబ్రహ్మ పరమాత్మరూపమగు అగ్నిలో అభేద దర్శన రూపమును యజ్ఞము ద్వారానే ఆత్మరూప యజ్ఞహవనముచేయుచు నుందురు. కొందరు శ్రోత్రాది సమస్తేంద్రియములను సంయమ రూపాగ్నియందు వేల్చు దురు. కొందరు శబ్దాది సమస్త విషయములను ఇంద్రియ రూపాగ్నిలో హవనము చేయుచుందురు. కొందరుయోగులు సమస్తేంద్రియ సర్వకర్మలను ప్రాణముల సమస్త క్రియ లను జ్ఞానప్రకాశితమగు ఆత్మసంయమ యోగరూపమగు అగ్నిలో వేల్చుదురు. కొందరు ద్రవ్యసంబంధమగు యజ్ఞ కర్తలు మరికొందరు తపస్యారూప యజ్ఞకర్తలు, కొందరు యోగరూప యజ్ఞకర్తలు, కొందర హింసాది తీక్ష్ణవ్రత సమే తులై యత్నశీలురై స్వాధ్యాయ రూపమగు జ్ఞానయజ్ఞ కర్తలును. కొందరు యోగులు అపానవాయువులో ప్రాణ వాయువును వేల్చుదురు. ఇంకెందరో నియమితాహారులు ప్రాణాయామ పరాయణులుసగువారు ప్రాణాపానగతులను నిరోధించి ప్రాణములను ప్రాణములయందే హవనము చేయుచుందురు. ఈ అందరు సాధకులును యజ్ఞముల ద్వారా సమస్త పాపములను బోగొట్టు కొనువారును యజ్ఞ విదులునై యున్నారు."

పై శ్లోకములలో భగవానుడు సాధనయొక్క భిన్నభిన్న మార్గములును అనేక కళ్యాణమార్గములును సూచించి యున్నాడు. వీనిలో నేయొక్కటైనను సరే-సాధించు పురు షుడు పరమాత్ముని బడయగలుగును. ఇక్కడ "యజ్ఞ" శబ్దము సాధన వాచకము. తద్ద్వారా సనాతన బ్రహ్మప్రాప్తి యును. కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠ- ఈ రెండింటి భేదములు విస్తారముగ జెప్పబడియున్నవి. వీనికనేకాంగము లుపాంగ ములుగలవు. అందుల నేదైన నొకమార్గమును తత్సా ధనము నేమహాత్ముడైన మనకు దెలియజేసెనా మనము తరించిపోవుదుము. మనకు భగవత్ప్రాప్తియు గలుగును. కర్మయోగ సాంఖ్యయోగసాధనములద్వారా అధ్యాత్మపథ ప్రవేశులకు సఫలత్వము నిశ్చితమే. మహాపురుష ప్రోక్త మగునేయొకమార్గ మనుసరించిన వారును పరమ పద మును బడయగలుగుదురు.

ఉపర్యుక్త సాధనములలో నే యొక సాధనము నవలం బించినసుసరే-మల-విక్షేప-ఆవరణములు పూర్తిగా నశించి పోవును. అనగా - వారి సమస్త దుర్గుణ-దురాచార-దుఃఖ ముల-విఘ్నముల మోహముయొక్క నాశనమై బుద్ధి మనస్సు స్థిరపడి భగవత్కృపవలన భగవత్తత్త్వ మెరింగి సాధకుడు పరమశాంతి పరమానందము నిశ్చయముగ బడయగలడు.

(కళ్యాణ్ నుండి)

వేదాऽహమేతం పురుషం మహాంతం।
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్।
తమేవం విదిత్వాతి మృత్యుమేతి।
నాऽన్యః పంథా విద్యతేऽయనాయ॥

# భగవద్గీత మానవజాతికంతకు మతగ్రంథము

**శ్రీ గాయత్రీ పీఠాధిపతులగు శ్రీశ్రీశ్రీ విద్యాశంకర భారతీస్వామివారి ఉపన్యాస సారము.**

ఈ మార్గశిర మాసములో శుద్ధ ఏకాదశీ పవిత్ర దివసము (ది 2-12 57) శ్రీ గీతా జయంతీ మహోత్సవదివసము కావున బందరు పట్టణములో విశిష్టాద్వైత మత ప్రచార సంఘమువారున్ను యతిరాజ మహిళామండలి వారున్ను శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారయణ రామానుజ జీయరుగారిచేత 18 దినములు గీతా జయంత్యుత్సవములను చేయుచు ఆ యుత్సవముల ప్రథమ దివసమున శ్రీ గాయత్రీ పీఠాధిపతులగు శ్రీశ్రీశ్రీ విద్యాశంకర భారతీస్వామివారిని అధ్యక్షులుగా ఏర్పాటుచేయగా, వారు ఆనాడు 'భగవద్గీత మానవజాతి కంతకు మతగంగ్రథము' అను విషయమును గురించి చక్కని విమర్శతో కూడిన ఉపన్యాసమును గావించిరి. దాని సారభూతమీ క్రింది వ్యాసము.

మనస్సుతో నాలోచింపగలిగిన వ్యక్తి మానవుడు. అట్టి మానవుని మనస్సుకు మూడు రకముల ప్రవృత్తి కలదు. 1. వాంఛించుట, 2. అనుభవించుట, 3. తెలిసికొనుట. వాంఛయొక్క ఫలితము కర్మాచరణమేకదా. అనుభవ మెప్పుడును ప్రేమను పురస్కరించుకొని యుండును. ప్రేమయనగా భక్తియొక్క స్వరూపమేకదా. తెలిసికొను టకు పర్యవసానము సర్వజ్ఞత్వమును కలుగజేయు జ్ఞానమే కదా. ఇట్లు మానవుని ప్రవృత్తి సహజముగ కర్మ, భక్తి, జ్ఞానములను త్రిపథగామియై విరాజిల్లుచున్నది. సర్వ మానవుల కివ్విధంబున నలరారు త్రివిధమానసిక ప్రవృత్తులను సంస్కరించి పరిపూర్ణత నొందించి మోక్ష సామ్రాజ్యమున నధిష్ఠింపచేయుటకే భగవద్గీత అవతరించి నది. ఈ కర్మభక్తిజ్ఞానములను మూడింటిలోను ఎట్టి వైషమ్యము లేదనియు, పైపెచ్చు అవన్నియు సమరస ముగా జీవుని గమ్యస్థానమునకు చేర్చు మార్గమును ప్రదర్శించుననియు భగవద్గీత బోధించుచున్నది.

గీతలోని 18 అధ్యాయములును కర్మషట్కము, భక్తి షట్కము, జ్ఞానషట్కము అను విధమున ఒక విభాగ మును, జీవషట్కము, ఈశ్వరషట్కము, జీవేశ్వర ఐక్యషట్కము అను విధమున ఇంకొక విభాగమును-ఇట్లు రెండు విభాగములుగ పరిశీలింపవచ్చును. మరియు ఈ రెండు విభాగములును భిన్నమార్గములుగాక అన్యోన్య సంబంధముగలవియునై విరాజిల్లుచున్నవి. అదెట్లనగా- మొదటి షట్కములో ప్రశంసింపబడు జీవుడు. ఆ షట్క ములో ప్రతిపాదింపబడిన నిష్కామ కర్మానుష్ఠానముచే సంస్కృతుడై, ద్వితీయ షట్కములో ప్రతిపాదింపబడిన ఈశ్వరుని ఆ షట్కములో ప్రశంసింపబడిన భక్తిచే భజించి తృతీయ షట్కములోని జ్ఞానముచే జీవబ్రహ్మైక్యమును పొంది ముక్తుడగును. అని గీతాసందేశము. ఇంకను కర్మ జ్ఞానములమధ్య భక్తి ఉండుటవలన దేహళీదీపన్యాయ మున ఇటు కర్మమునకు అటు జ్ఞానమునకును ఉపయో గించునదై యున్నది. అందుకనే ఈ మూడింటియొక్క అన్యోన్యసంబంధమును వ్యక్తము చేయుచూ జ్ఞానమును ఒక దీపముగా పోల్చి ఈ జ్ఞానదీపమునకు కర్మనిష్ఠాఫలితము వత్తి అనియు భక్తి చమురు అనియు గీత వర్ణించినది. వత్తియు చమురును లేని దీపము వెలగదుగదా. కనుక కర్మ, భక్తిలేనిదే జ్ఞానోదయము కానేరదు.

ఇంకను గీతలో నీ కర్మ భక్తిజ్ఞానములేకాక, యోగము, సన్యాసము, ప్రపత్తి, వైరాగ్యము ననునవి కూడ బోధింప బడినవి. గీతలోని 700 శ్లోకములును ఈ పై యేడు విష యముల క్రిందను భాగింపవచ్చును. వీనిలోకూడ ఒక క్రమపద్ధతిని సోపాన పరంపరగా గీత బోధించుచున్నది. అదెట్లనగా - జీవుడు నిష్కామ కర్మానుష్ఠానముచే చిత్తశుద్ధిని ప్రప్రథమమున పొందవలెను. ఇట్లు చిత్తము లోని మాలిన్యము నిష్కామ స్వధర్మానుష్ఠానముచే పోగా, యోగాభ్యాసముచే చిత్తములోని చాంచల్యము పోవును. కనుక కర్మతరువాత యోగము పైమెట్టు. ఆపైని భక్తి చేయగా భగవంతుని అనుగ్రహము కలుగును. ఆపైని ప్రపంచ విషయములందు వైరాగ్యమును అభ్యసించిన గాని ఆ భక్తి భగవంతునియందు దృఢపడనేరదు. అంతట భక్తివైరాగ్యములలో భక్తి అధికముగనుండిన ప్రపత్తిలోని కిని, వైరాగ్యము అధికముగ నుండిన సన్యాసములోనికిని దింపును. ఆపైని జ్ఞానము కలిగి జీవుడు ముక్తుడగును. ఇట్లు గీత పైయేడు సోపానముల ద్వారా మోక్షమార్గమును ప్రదర్శించినది. మోక్షసాధనలు ఈ యేడు కంటె లేనేలేవు. ఇట్లు వీని నన్నింటిని సమరస పద్ధతిని సమన్వయపరిచి మోక్షమార్గమును ప్రదర్శించిన గ్రంథము భగవద్గీత తప్ప నింకొకటిలేదు.

ప్రపంచములోని ఇతరమతగ్రంథములు, అనగా బైబిలు, కొరాను మున్నగునవి ఈ యేడు సాధనలలోనే

యొకదానినో లేక కొన్నింటిని మాత్రమే స్వీకరించి మతమును ప్రదర్శించినవి. బైబిలులో భక్తియును, నీతియును, కొరానులో ప్రపత్తియును, బౌద్ధమత గ్రంథములో అహింసాదినీతి, వైరాగ్యమును, జూడయజము నీతిని, పారసీక మతము భక్తిని, వైష్ణవ శైవశాక్తే యాది మతములు భక్తిని, ఈ విధముగ ప్రపంచములోని మతము లన్నియు గీతలో బోధింపబడిన వివిధ సాధనలలో నేదో యొకదానినో కొన్నింటినో మాత్రమే బోధింపుచున్నందున ఇతర మత గ్రంథములలో బోధింపబడినవన్నియు గీతలో అంతర్భాగములై యున్నవనియు, గీతలోలేనివి దేనిలోను లేవనియు స్పష్టమగుచున్నది. కనుకనే గీతప్రపంచములోని మానవులందరికిని మతగ్రంధముగా విరాజిల్లుచున్నదనిన అతిశయోక్తి కానేరదు. ఈ కారణము చేతనే గీత ప్రపంచములోని భాషలన్నింటిలోకిని అనువదింపబడి ప్రకాశింపుచున్నది.

ఇంకను మన సంస్కృత వాఙ్మయములోనే రుద్రగీత, రామగీత, శివగీత, శ్రుతిగీత మున్నగు అనేక గీతలు ఉన్నవి. కాని ఆ గీతలన్నింటిలోను ఈ భగవద్గీత మాత్రమే ప్రఖ్యాతిని గాంచినది. దీనికి రెండు కారణములు గలవు. మొదటిది- ఆ మిగతా గీతలలోకూడ ఇతర మత గ్రంథములవలెనే మోక్షసాధనములలో ఏకొన్నియో చెప్పబడినవి; కాని, అన్ని సాధనములను గీతలోవలె సమన్వయపరుపబడలేదు. రెండవకారణ మేమనగా—మిగతా గీతలు ఆయా అవతారమూర్తులచే బోధింపబడగా, భగవద్గీత సాక్షాత్తు ఆ భగవంతుని చేతనే బోధింపబడినది. గీతను శ్రీ కృష్ణుడు బోధించినట్లు కనపడుచున్నను, దేవకి వసుదేవపుత్రుడుగా కృష్ణుడు గీతను చెప్పలేదనియు, సాక్షాత్తు ఆ భగవంతుడుగానే బోధించినాడనియు గీతలో శ్లోకములవలననే స్పష్టపడుచున్నది. నాల్గవ అధ్యాయ ప్రారంభమున శ్రీ కృష్ణుడు ఈ గీతాబోధను సృష్ట్యాదిని సూర్యభగవానునికే చేసినట్లు కనపడుచున్నది. ఈ సృష్టి పుట్టి ఇప్పటికి 195½ కోట్లపై చిలుకుసంవత్సరములైనది. కనుక ఈ భగవద్గీతలోని బోధ 195½ కోట్ల సంవత్సరాలకు పూర్వముది. అంతియే కాదు. ఈ సృష్టికి పూర్వము ప్రళయము, దానికి పూర్వము ఇంకొక సృష్టియు—అట్లు పరంపరగా వెనుకకుపోవుచూ సృష్టి అనాది అయ్యున్నందున, గీతాబోధయు అనాదియే అయ్యున్నది. మిగతా బైబిలు, కొరాను మున్నగునవి 200 సం॥ లలోపువిగదా. కనుక సృష్టికంతకు ప్రవర్తకమై మానవజాతి కంతకు మత గ్రంథముగ విరాజిల్లగల లక్షణములుగలది ఒక భగవద్గీత తప్ప వేరొకటి లేదనిన అతిశయోక్తి కానేరదు. ఆయా ఇతరమత ప్రవక్తలు ఆయా కాలములలో ఆయాదేశములలోనున్న పరిస్థితులనుబట్టి అవసరమగు బోధను చేసియున్నారు. కాని శ్రీ కృష్ణపరమాత్మ అర్జునుని నిమిత్తముగా చేసికొని సర్వకాలములకు సర్వదేశములకు పనికివచ్చేలాగున మోక్షమార్గమును భగవద్గీతలో ప్రదర్శించినందున గీతయే మానవజాతికంతకును మతగ్రంథము.

---

# ANDHRA ARCHITECTURE

*By*

V. V. TONPE

**A breathing space. A fear that I have long been usurping a few precious moments of your busy life, Reader, has, of late, grown much upon me. A high-brow stuff like architecture cannot, perhaps, be relished *ad infinitum* and a small break, a respite, a breathing space, might be much welcome by you. There is an adage that even when an elephant sits, it will be as tall as a horse. Architecture has tried to come down her queenly pedestal in my articles, yet she is no common-man's paragon. And to love her and live with her, one requires within one-self much pep and pepsin. As no natural resource is perennial I do not propose to tap your load of energy and patience to the last quantum, but will be planned and systematic in my exploitation of your wasting assets. So *au revoir !***

